ప్రథమ పుష్పం

# కథాంజలి

(పది ఉత్తమ కథల సంపుటి)

★


రచన

తుషార్


★


ప్రవాసాంధ్ర పబ్లికేషన్సు

భిలాయ్ నగర్ (మధ్యప్రదేశ్)

# మనవి.

ప్రచురణసంస్థ సంస్థాపకులలో ముఖ్యులై సర్వకార్యభారాన్ని వహించిన సంపాదకులు శ్రీయుత యనమండ్ర కైలాసరావుగారికి, కోరిన వెంటనే తమ ఉదాత్త రచనలు యిచ్చి మా కృషిని జయప్రదం చేసిన శ్రీ మెట్ట సూర్య నారాయణమూర్తి గారికి, "కథాంజలి" ప్రచురణ విషయంలో మాతో సహకరించి, పుస్తక ప్రతిని సర్వాంగసుందరంగా తయారుచేసి, సకాలంలో అందచేసిన, భారతీ ప్రెస్సు అధిపతులకు మా కృతజ్ఞతాభివందనలు.

ఇట్లు
భవదీయులు

ప్రవాసాంధ్ర ప్రచురణలు

భిలాయ్ భిలాయ్‌నగర్

తేదీ. 14—8—59 (మధ్యప్రదేశ్)

# విజ్ఞప్తి.

ప్రచురణార్థం మాతో పూర్తిగా సహకరించి, మా కృషిని హర్షించి, ప్రోత్సహించిన సాహితీ పరులకు, స్నేహితులకు, అభిమానులకు మా హృదయపూర్వక అభివందనలు.

ఇట్లు
ఎడిటర్
ప్రవాసాంధ్ర ప్రచురణలు
భిలాయ్ నగర్ (మధ్యప్రదేశ్)

ఇందులో....

# నా రా ణి

—oo◇oo—

ప్రాణేశ్వరా !

చితికిన మనస్సులు అతికాను. మరచిపోతూ ఉన్న మమకారాల్ని మళ్ళా కలిపాను. ఎందరి జీవితాల్ని విషాద పూరితం చేశానో......ఎందరి మనస్సుల్ని వసంతమయం చేశానో... ...ఆ సంఘటనలన్నీ నేటికీ నా స్మృతిపథంలో లీలగా మెదులుతూనే ఉన్నాయ్. మరచిపోతూ ఉన్న మమకారా లన్నిటినీ మళ్ళా కదిపి, నీ మనస్సులో మారణ హోమం రగల్చడం నా కిష్టంలేదు. పట్టుమని పద్దెనిమిది సంవత్సరాలుకూడా లేని నా జీవితానికి యీ వియోగమా ? ఇది నా మనస్సులో మానని గాయమై, నిత్యం నన్ను బాధించి, వేదిస్తూనే ఉంది.

తొలిరోజుల్లో నా నాట్యాన్నిచూసి ఏరి కోరి నా ఎత్తు ధన మిచ్చి నన్ను వరించావ్ ! నేను లేకపోతే ఒక క్షణం కూడా నీవు బ్రతకలే నన్నావ్ ! నేను కనబడకపోతే బిక్క-ముఖం వేసుకొని, పొడి ఆరిపోయిన పెదిమలతో ఆత్రుతగా యిల్లూ, వాకిలీ గాలించేవాడివి. కన్నీరు పట్టిన కళ్ళతో మీ అమ్మను లక్షసార్లు అడిగేవాడివి. అంధత్వంలోనున్న ఆ అభాగ్యురాలికి నా ఉనికి ఎలా తెలుస్తుంది ?

మందుపెట్టిన మనిషిలా — నూనె[త్రాగిన కుక్కలా రాత్రింబవళ్లు నీ వెంట తిరిగేదాన్ని. సంధ్యాసమయాల్లో నన్ను ఏ రమణీయదృశ్యాలదగ్గరకో తీసుకొనిపోయి, బలవంతంగా యేవేవో అక్షరాలు నాచేత రాయించేవాడివి? నీ ఊహలు చూసి నాలో నేనే నవ్వుకొనేదాన్ని. ద్విత్వాక్షరాలతో కూడిన ఆ వర్ణనలు రాయటానికి ఎక్కడలేనిసిగ్గూ నా మనస్సుని ఆవహించేది. రాయలేకపోయేదాన్ని. అప్పుడు బాధగా నన్ను నీ చేతుల్లోకి తీసుకొని బరువుగా నిట్టూర్పులు విడుస్తూ, జాలిగా నా తల నిమిరేవాడివి.

నా జీవితకాలమంతా పరుల ఆనందంకోసమే నాట్యం చేయించి, చివరికి నన్నీ స్థితికి తీసుకువచ్చావ్! ముఖ్యంగా నీ ప్రియురాండ్రకు రాసిన అసంఖ్యాకమైన ప్రణయలేఖలు వల్లే నా జీవితం సర్వనాశన మైంది. రాసే ప్రతి అక్షరానికీ, పెట్టే ప్రతి ద్విత్వానికీ నా శరీరంలోని ఎన్నిచుక్కల రక్తం నీరయిందో నీకు తెలుసా? నాట్యం చేసేందుకు కాళ్ళల్లో శక్తికూడా కరువైంది.

నీ నోటంట వచ్చే ప్రతి అక్షరం నా స్వహస్తాలతో లిఖించి, నాలో నేనే ఎంతోకాలం బ్రహ్మానందాన్ని పొందాను. అసంఖ్యాకమైన ఆ ఉత్తరాలు తల్చుకొన్నప్పుడల్లా నేనే రాశానా? అని ఆశ్చర్యం కలుగుతుంది. ఎంతకాలం నిర్విరామంగా నాచేత నాట్యం చేయించావో నాకే తెలీదు.

నా సహాయంతోనే పట్టభద్రుడివి కూడా అయ్యావ్ !!

ఇంతకుమునుపు ఎందరెందరికో, ఎన్నెన్నో ప్రేమ లేఖలు నా చేత రాయించేవాడివి. ఇప్పుడు వాళ్ళందర్నీ శాశ్వతంగా మరచిపోయావా ? నేటికీ వాళ్ళు రాస్తూనే ఉన్నారు — నీవు చదివి ఆనందిస్తూనే ఉన్నావ్!! ఇప్పుడు నావైపైనా చూడవ్... పలుకరించనైనా పలుకరించవ్ !... నువ్వు, నాచేత ఎన్నో మధురాక్షరాలు రాయిస్తావని, ఏకాంతంగా ఉండే ఏ నదీ సైకతాల్లోకో తీసుకొనిపోయి, ఏ ఆనందడోలికల్లోనో ఊగిస్తావని ప్రతిక్షణం నీకోసం కలలు కంటూనే ఉంటాను.

ప్రేయసి పంపిన మనియార్డర్లు అందుకోవాలనే ఆత్రుతతో పోస్టుమేన్ రాకకోసం ఎదురుతోవలు చూస్తూ ఉండేవాడివి... నిర్లక్ష్యంగా నన్ను జేబులోనుండి బయటకు తీసి రేమ్‌గా సైన్‌చేస్తావ్ ! ఆ బాధ తట్టుకోలేక, నీ చేతిలో గిలగిల తన్నుకుంటూంటే పోస్టుమేన్ ఇచ్చే కట్టలకుకట్టలూ కరంసీనోట్లు రెండుచేత్తో అందుకొని జేబులో కుక్కుకొంటావ్ ! నన్ను లోపలకు పంపి — శూన్య హస్తాలతో బయటకు పంపుతావ్ ! తల వంచుకొని భారంగా అడుగు వేస్తూ, బాధగా మెట్లుదిగి వెళ్ళిపోతూన్న ఆ అభాగ్యుని చూసేసరికల్లా నాకు ఎక్కడలేని జాలీ కలుగుతుంది. నే నా దీనునికి ఎలా సహాయం చెయ్యగలనూ ? నా అస్వాతంత్ర్యానికీ,

అసమర్థతకీ లోలోపలే బాధపడతాను.

నీ విలాసాలకూ, వినోదాలకూ, విహారాలకూ వంద లకువందలూ ఖర్చుచేస్తావ్! నీ ఐశ్వర్యంకోసం రాత్రింబవళ్లు విరామం లేకుండా ప్రణయ లేఖలు వ్రాసిన నాకు...... ఎన్నడైనా ఒక కానీ ఎత్తు కాసైనా నా కంఠాన్ని కట్ట గలిగావా......?

నీ జీవిత నైషధంలో ఇమిడి ఉన్న శృంగార గాథని ఒక్కసారి సింహావలోకనం చేసుకో......

ఒకప్పుడు నీవు కాలేజీ ప్రాంగణంలో ఆనందంగా గడిపిన ఆ మధుర స్మృతులు ఇప్పటికీ నా కళ్ళ ఎదుట తిరుగుతూనే ఉన్నాయ్. ఆమె ఎవరివల్ల నీకు పరిచయ మైందో విలాసపూరితమైన నీ మనస్సు యిప్పుడు మరిచి పోయింది. అవసరనిమిత్తం నీ చేతుల్లోనుండి, చిరునవ్వుతో నన్ను తీసుకొని — ఇంటికి తీసుకొనివెళ్ళి, హృదయానికి హత్తుకొని యెన్నెన్నో ముద్దులు పెట్టుకుంధి. సాయంత్ర సమయంలో నన్ను ఏకాంతంగా ఉండే పై అంతస్థు లోకి తీసుకొనివెళ్ళి తొలి ఉత్తరం నాచేతే రాయించింది. అది మర్నాడు నీవు లేబొరేటరీలో చదువుకొని లోలోపలే నవ్వుకొన్నావ్! — నేను ఆమె చేతిలో మెదిలేటప్పుడు ఆమె సహాధ్యాయిన్లు ఆశ్చర్యంగా నా చుట్టూ మూగి, అనుమానంగా నావైపు చూస్తూ ఆమెను ఎన్నెన్నో యక్షప్రశ్నలు వేసేవారు. నా పుట్టుపూర్వోత్తరాలు తీయా

లని ఎంతో ఆరాటపడి, నిరుత్సాహ పడేవారు. నా అంద చందాలూ, నా నడవడికా చూసి జలసీ ఫీలయ్యారు.

నేను రాసిన ఉత్తరంకోసం ఆమె మనస్సు ప్రతి రోజూ తహతహలాడేది. నేను మహా నైపుణ్యంతో మలచిన అక్షరక్రమం చూసి లోలోపలే మురిసిపోయేది. భ్రమ తీరక చదివిందే పదిసార్లు చదువుకొనేది. విధి విరామం లేకుండా మీ ఇరువురిమధ్యా ఎంతకాలం నాట్యం చేశానో తలచు కుంటే నా గుండె బ్రద్దలౌతుంది !

తొలిచూపులోనే నన్ను నీ దానిగా చేసుకొన్నావు. నేను కాపురానికి వచ్చిన కొత్తరోజుల్లో నన్ను పరుల హస్తగతం చేయాలంటే పసిపాపలా బాధపడేవాడివి. ఒక్క సెకెండు నేను కనబడకపోతే నౌఖర్లందర్నీ అడిగేవాడివి.

ఇప్పుడు నన్ను పట్టుకొని వీథులవెంట తిరుగుతావ్. అడిగిన ప్రతి నీచుడికీ నిర్దాక్షిణ్యంగా జారవిడుస్తావ్ ! ఇందుకేనా నన్ను నీ దానిగా చేసుకొన్నది ? నిజంగా నీలో మానవత్వం ఉందా ?? నేనొక పెద్ద నాట్య మయూరినని, నీ స్నేహితుల ముందు నన్ను తెగ ప్రశంసించేవాడివే ? ఇప్పుడు నన్నిలా శాశ్వతంగా మర్చిపోగలిగావ్ ! ఆ పాగడ్తల్లో ఉన్న అంతరార్థం అంతా ఒట్టి పొల్లేనా ?...

ఇప్పుడు సువర్ణఛాయతో మిలమిల మెరుస్తూన్న ముఖ వర్చస్సుతో సంధ్యాకాంతిలో తలతలలాడే నవ యౌవ్వ నంలో, ట్విల్ షర్టులోనుండి బయటకు తొంగిచూస్తూన్న

ఆ రమణీయ సౌందర్యవతి ఎవరు ? ఆమె పేరులో ఇమిడి ఉన్న మధురాక్షరా లేమిటి ? నేను సజీవంతో నీ ఆధీనంలో ఉండగా మరొక నర్తకికి నీవు దాసుడు కావటం నేను సహించలేను. ఇప్పుడు నా కండ్లనుండి బాధగా రాల్తూన్న ప్రతి కన్నీటి బొట్టులోనుండి ప్రళయాగ్ని ప్రజ్వరిల్లి ఆమె నవ యవ్వనాన్ని క్షణ కాలంలో భస్మీభూతం చేయక మానదు —

నువ్వు డబుల్ న్యుమోనియాతో కలకత్తాలో ఏకాకిగా బాధపడుతూ ఉంటే నిన్ను చిన్నప్పటినుంచీ సాకి, నీ అభివృద్ధిని కళ్ళారా చూడాలని కలలుకన్న ఆ వృద్ధ వితంతువు లెక్కలేని డాక్టర్లను తీసుకువచ్చి నీ ముందు నిల బెట్టేది. తల నెరసిన ఆ బెంగాలీబాబులుకూడా ఒక్కసారైనా నా వైపు చూడకుండా ఉండలేకపోయేవారు. ప్రిస్క్రిప్షన్ రాయాలనే నెపంతో ఒక్క నిమిషమైనా నా నాట్యాన్ని చూసి ఆనందించాలనే క్షణిక తలంపుతోనే... నువ్వు చూడకుండా చటుక్కున చేతుల్లోకి తీసుకొనేవారు. అరవైయ్యవ పడిలోనున్న ఆ వైద్యశిఖామణుల ఆరాటం చూసి నాలో నేనే నవ్వుకొనేదాన్ని......

ఎప్పటికైనా మీ మనస్సు కరుగుతుందేమోనని — నా జీవితాన్ని వసంతమయం చేస్తారేమోనని "జాబు వచ్చిందా ?" అని ప్రతిరోజూ పోస్టుమేన్ పున్నయ్య నడిగి నిరుత్సాహపడుతూనే ఉంటాను. పోస్టుమేన్, నా విషాద

జీవితాన్ని చూడలేక, జాలిగా రెండు కన్నీళ్ళు గుమ్మంలోనే విడచి వెళ్ళిపోతాడు.

ఈ విశాల ప్రపంచంలో నా కష్టాలు చూసి జాలిగా రెండు కన్నీళ్ళు కార్చే కరుణాసాగరుడు అతనొక్కడే కనబడుతున్నాడు!

చివరికి ప్రపంచజ్ఞానం తెలీని ఒక పసి బాలుని లేత హస్తాలలో, మధ్యాహ్న సమయంలో, నిప్పులు కురుస్తూ ఉన్న వేళ, చాల విషాదంగా నా జీవితం సమాప్తమైంది.

నన్ను హిమవత్ శ్రేణిలో ఉండే ఏ ప్రశాంత వాతావరణంలోకో తీసుకొనిపోయి...... చక్కని సౌధాన్ని నిర్మించి... ... ... అందులో స్వర్గసుఖాన్ని అనుభవిస్తూ ఏ "మారిస్" కారులోనో తిప్పుతావని కలలు కన్న, కలలన్నీ, ఈ ప్రపంచంలో కల్లలుగానే మిగిలిపోయాయ్—

ఇంక శలవ్,

మీ

చరణదాసి,

పార్కర్ క్వీన్.

(చిన్నాభిన్నమైన నాపార్కర్ క్వీన్ విలపించిన విషాదచరిత్ర.

—రచయిత.)

# శిల్పసుందరి

అంధకారంలో అడుగులేస్తూ కాలిబాటగుండా చర చరా సాగిపోతూ ఉన్న ఆ వృద్ధుని పాదాలకు ఎవరో సంకెళ్ళు వేసినట్లు నిల్చుండిపోయాడు.

సమీపంలో ఎవరో మందభాగ్యురాలు భారంగా బాధపడుతూ ఉన్నట్లు హీనస్వర మొకటి అస్పష్టంగా విన వచ్చింది.

నలు దిక్కులా అలుముకొన్న చీకటిని ఒకసారి కలయ జూసి, భారంగా తల వాల్చుకొని, కొంచం సందేహిస్తూనే నడకలో లీనమైపోయాడు. అరవై సంవత్సరాల క్రితం ఆ వృద్ధుడు ఎందుకో చాలాసార్లు ఆ ప్రదేశానికి అర్ధరాత్రి సమయంలో వెళ్ళినట్లు జ్ఞాపకం! ఐదు పుష్కరాల క్రిందట వదలి పెట్టిన అ స్థలాన్ని మళ్ళా ఈ రోజునే క్రొత్తగా చూస్తున్నాడు. ఆ స్థలం చూస్తూఉంటే చిన్ననాటి చిట్టితలంపు లేవో జ్ఞాపకానికి వచ్చాయ్ కాబోలు! అప్రయత్నంగా ఆ వృద్ధుని కండ్లు అశ్రువులతో నిండిపోయాయి.

సమీపంలో అతి సౌందర్యంగా మలచబడిన ఐదడుగుల శిల్పసుందరి వృద్ధుణ్ణిచూసి వికృతంగా నవ్వింది. రెండడుగులు వెనక్కువేసి ఆ సౌందర్యరాసిని రెప్పవాల్చకుండాచూస్తూ

కొన్ని క్షణాలపాటు నిలుచుండి పోయాడు. ఆ శిలాప్రతిమ ఒకసారి నిట్టూర్చి, హీనస్వరంతో "నన్ను మరచిపోయావా?" అన్నట్లు నిర్జీవమైన ఒక చిరునవ్వు నవ్వి ఊరుకొంది. కానీ ప్రాణంలేని ఆ చిరునవ్వు ఆమె పెదెమలపై యెంతో సేపు లేదు. ఆమెకళ్ళు ఆ కటికచీకట్లో అగ్నిగోళాల్లా మెరిశాయ్. ఆ శిలాప్రతిమ వృద్ధుని కళ్ళలోకి చూస్తూ, బాధగా యిలా అంది.

"జీర్ణశల్యాలతో......ఆరని ఆశాజ్వాలలతో...... మరచిపోని మమకారాలతో......మాతృమూర్తిని జ్ఞాపకం చేసుకోని స్వస్థలం యెన్నాళ్ళకు వచ్చావ్!! నీ ఉజ్వల భవిష్యత్‌ని, కళ్ళారాచూసి ఆనందించాలని కలలు కన్న ఆమె కలలన్నీ కల్లలుగానే మిగిలిపోయాయ్. నీ కోసం బెంగతో చిక్కి, శల్యమై ఒకరోజురాత్రి చాలా విషాదంగా మరణించింది. ఇప్పుడు ఆమె రుద్రభూమిలో ఏ మారుమూలనో నిరాలోచనగా నిద్రపోతోంది. అంత్యక్షణంలో నిన్ను చూసేటందుకు ఆ మాతృమూర్తి ఎంతగా ఆరాటపడిందో నీకు తెలీదు — నీ భాగ్యచక్రానికి ఆమెొక మార్గదర్శకురాలు! బాధావ్యథలతో నిండిన ఆమెజీవితానికి శాశ్వతశాంతి ప్రేతభూమిలోనే లభ్యమైంది. ఇప్పుడు ఆమె ముఖంలో నీకు ఎటువంటి బాధా కనబడదు. నిరాలోచనగా ఉండే నిండు ముఖంతో — నిష్కల్మషమైన చిరునవ్వుతో చలనరహితమైన

చూపులతో — ఆమె భౌతికకాయం సమాధినీడలలో శాశ్వత శ్వేద తీర్చుకొంటోంది."

వృద్ధుని కళ్ళనుండి రెండు కన్నీటిబిందువులు బాధగా రాలాయ్. అతనిమనస్సు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ నఖశిఖపర్యంతం బాధతో కంపించిపోతోంది. కాళ్ళక్రింద నున్న మట్టికదలిపోతూ ఉన్నట్లు అనిపించింది. ఇం కక్కడ ఒక్కక్షణంకూడా నిల్చోలేక పోయాడు. అప్రయత్నంగా అతని పాదాలు రెండవ సుందరి దగ్గరకు కదలిపోయాయ్!

అర్ధరాత్రి కావటంచేత ప్రశాంతంగా కళ్ళు మూసుకొని, ప్రపంచాన్నే మైమరచి ఆమె నిద్రపోతోంది. వృద్ధుడు భారంగా ఆకులమీద వేస్తూన్న అడుగుల చప్పుడికి చప్పున ఆమెకు మెలుకువ వచ్చింది. అప్రయత్నంగా కళ్ళు విప్పి నలుమూలలా కలియ చూసింది. ఎనభై య్యేవ పడిలోనున్న ఒక వృద్ధుడు అకస్మాత్తుగా ఆమె దృష్టిని ఆకర్షించాడు. ఆ వృద్ధుణ్ణి పోల్చి పట్టినట్లు జాలిచూపులతో — నిరాశ ప్రతిఫలించే ముఖ వర్చస్సుతో "నువ్వింకా బ్రతికే ఉన్నావా?" అన్నట్లు జాలిగా వృద్ధుని కళ్ళలోకి చూసింది.

"మంచుకొండలమీద సహితం మనశ్శాంతి దొరక్క - మళ్ళా మనశ్శాంతిలేని మానాపురానికే మరలి వచ్చావా? నువ్వెళ్ళిన రెండవ రోజునే "రేస్మా" మరణించింది" — వృద్ధుని తలమీద పెద్ద పిడుగు పడ్డట్టయింది.

"చివరి క్షణమైనా అంత్యక్షణంలోనైనా కడసారి చూళ్ళేకపోయావ్. ఆ రోజుల్లో ఉన్న ఆనందం — ఆ వయస్సులో ఉన్న సొగసూ — ఆ పెదెమలపై నాట్యంచేసే చిరునవ్వూ ఇప్పుడు మచ్చుకైనా కనిపించ వెందుచేత? పాపం! వృద్ధాప్యం దాపురించింది కాబోలు — అంధత్వానికి లోనయావ్—సంఘాన్ని ఎదురించలేకపోయావ్ – శాసనాన్ని సరిదిద్దలేకపోయావ్—ఆమెను వివాహం చేసుకోలేకపోయావ్! శాసనాన్ని భేదిస్తే బహిష్కారణతో భవిష్యత్ జీవితమంతా, బాధా బరువులతో నిండిపోతుందని భయపడ్డావ్!! ఆప్తులు అసహ్యించుకొంటారని, ప్రాణస్నేహితులు పరిహాసిస్తారని, ధర్మశాస్త్రాలు ధగ్ధమవుతాయని, పెద్ద మనుష్యులు చెప్పే తీర్మానాల్ని ఏకగ్రీవంగా ఆమోదించింది – నీ మనస్సు. ఆ రోజుల్లో నీలో కలిగిన అధైర్యం—అసమర్థతే, నేడు నిందిస్తూన్ని నీన్ని విషాధఛాయల్లోకి తరిమింది. నీలోకలిగిన నిరుత్సాహం కారుచిచ్చులా ప్రబలి, నిన్నూ, నీ శరీరాన్నీ చివరకు నీసర్వస్వాన్నీ దావాగ్నిలా దహించి వేసింది. సంఘాన్ని ఎదిరించి, శాసనాన్ని సరిదిద్దలేకపోయావ్. సంఘం గర్జించే గార్ధభగర్జనలకి భయపడి అంగుట్లోబడ్డ అమృతాన్నికూడా ఆస్వాదించలేకపోయావ్! సంఘం బంధించే ఇనుప సంకెళ్ళలోబడి సంసార జీవితాన్ని సర్వనాశనం చేసుకొన్నావే కాని భేదించి, ఛేదించి—ధైర్యంగా ఎదుర్కొనే సాహసం నీలో కరువైంది. చావలేక బ్రతికున్న 'జూలీ' ఎంతకాలమో

నీకోసం అరచి, అరచి, పస్తులతో సంవత్సరాల తరబడి మాడి ఆమె సమాధి మీదే ప్రాణాలు వదలింది. మొక్కలకు నీళ్ళుపోసి రంగు రంగుల పూలమొక్కలను నాటిన రంగయ్య కాలప్రవాహంలో కాలుజారి పడిపోయాడు. వాడు నాటిన పూలమొక్కల జాడే ఇప్పుడు నీకు కనబడదు. మోళ్ళులా ఎండి, ఆశగా ఆకాశంవైపు చూస్తున్నాయ్. వాడు నాటిన మొక్కలు యిప్పుడు మహావృక్షాలై వచ్చే పోయే బాటసారులకు సేద తీరుస్తున్నాయ్. మీరు మెదిలిన ఆ పూలతోటలో నేడు అసహ్యంగా ఆకులు రాలి, కారణ వశమున కారుచిచ్చు రగిలి, రాత్రింబవళ్ళు స్మశానంలా మండుతూ, వచ్చిపోయే బాటసారులకు హడల్ పుట్టిస్తున్నాయ్. మీరు విహరించిన ఆ స్థలాలు నేడు రాత్రించరులకు రహదారు లయాయ్. మీరు నిర్మించిన ఆ రాతిసోఫాలు నేడు రంకుబోతులకు రంగస్థలా లయాయ్.

"రేస్మా నీకోసం అలమటించి, ఏడ్చి, కన్నీరుకార్చి చివరికా కటిక చీకట్లో యేపొదలమాటునో శాశ్వత శాంతితో నిద్రపోతోంది. అంగుట్లో పడబోతూఉన్న అమృత పాత్రని చేతులారా జారవిడిచి, యిప్పుడు చేతులు పిసుక్కుంటే ప్రయోజన మేముంది? ఇప్పుడు ఆమెను పిలిచినా పలుకదు!!! చీకటిని తింటూ, చితివెలుగుల్ని చూస్తూ, కరుణార్ద్రహృదయులు విడిచే కన్నీరు త్రాగుతూ — సమాధిఛాయలో శాశ్వతంగా నిద్రపోతోంది—

కార్చేందుకు ఆ వృద్ధునికంట్లో కన్నీరు కూడా కరువైంది.

మరుక్షణంలో వృద్ధుడు భారంగా ఒక వేడినిట్టూర్పు విడచి, తుదిశ్వాస పీల్చుకుంటూ... ...ఆమె పాదాలమీదే వొరిగిపోయాడు ... ...

అతణ్ణి మరణించిన మాతృమూర్తే రమ్మందో... ... ప్రేమించిన ప్రియురాలే పిల్చిందో... ... లేక విధే శిక్షించిందో మాత్రం తెలీదు—.

[బహుమతి పొందిన కథానిక]

# జీర్ణసౌధం

అది... ఐదుతరాల క్రిందట అతి సౌందర్యమైన భవంతి అని ఆచుట్టుపట్ల నలభై గ్రామాల్లోనూ ప్రతీతి!

తొంభైయ్యవ పడిలో నున్న కరణంగారు దానిని గురించి ఎన్నో విచిత్రాలు చెప్తారు. ఇప్పుడు జీర్ణావస్థలో నున్న ఆభవంతిని చూస్తూ, దాని పూర్వస్థితి జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఉంటే, జాలిగా మన కళ్ళనుండి రెండు కన్నీటిచుక్కలైనా కారకతప్పదు......భయంతో మన చర్మం పులకరించకమానదు. శిథిలావస్థలోనున్న ఆ భవనం గురించి, ఇప్పుడు ఎవరైనా చెబుతూఉంటే, కాలిబాట గుండా పోయే మనలాంటి యువకజనం కుతూహలంగా గంటలతరబడి వింటూ ఉంటారు.

ఒకప్పుడు ఆ విశాలభవంతి గౌరవప్రతిష్ఠలకూ, దానధర్మాలకూ, అతిధి సత్కారానికీ ఆటపట్టై ఉండేది. పూర్వం ఆ కాలిబాటగుండా నడచివేళ్ళే బాటసారులు ప్రతిరోజూ అక్కడ యింత తిని పోతూ ఉండే వారట, ఇప్పుడు శిథిలావస్థలో నున్న ఆ భవంతిని చూసి జాలిగా రెండు కన్నీళ్ళు విడుస్తారు. పూర్వం ఆగర్భ శ్రీమంతు లెవరో అందులో కాపురముంటూ ఉండేవారని దాని ప్రస్తుత

స్థితిని చూస్తే తోచక మానదు. వాస్తు శాస్త్రం అనుసరించి, అనుభవజ్ఞులైన ఇంజనీర్లు మంచి ప్లాన్‌తో కట్టేరని మనికి తొలిచూపులోనే అర్థమాతుంది. సౌధోపరిభాగంలో, అతి మనోహరంగా చెక్కబడిన లతలకి, సంస్కారంచేసే దిక్కులేక, సాగిపోతూఉన్న బాటసారులవైపు దీనంగా చూస్తూ ఉంటాయ్ !

బీటలు బారి, పగిలి, శిథిలాలై, ఆశ్చర్యంతో హాడలు పుట్టిస్తూ ఉన్న ఆ పగుళ్ళలో నుండి—విషాదస్త్రీ ఎవరో, దీనంగా బయటకు తొంగిచూస్తూ ఉన్నట్లు కనబడుతుంది. పూర్వం రంగు రంగుల దీపాలతో నిశీథిలో కలకలలాడేదని, శ్రావ్యమైన సంగీతమేదో అందులోనుండి వినవస్తూ ఉండే దని, గ్రామస్థులు గంటల తరబడి శ్రవణానందంగా వింటూ ఉండేవారని వినికిడి ! ఇప్పుడు నిర్మానుష్యమైన ఆ సౌధంలో నరసంచార మున్నట్లే కనబడదు. గుడ్లగూబ లా ఇంట్లో శాశ్వత స్థిరనివాసా లేర్పరచుకొన్నాయ్.

పూర్వం ఆ బంగళాలో సంపన్నకుటుంబానికి చెందిన ఒక కళాకారుడు ఉంటూ ఉండేవాడు. అతని పేరు రతన్ కుమార్. బెంగాల్లోని మన్‌భూమ్ జిల్లాకు చెందిన వాడు, యువకుడు, విద్యావంతుడూ, వినయసంపన్నుడూ అయిన రతన్ ఆరులక్షలరూపాయలు ఖరీదుచేసే ఆస్థిపాస్థులకు హక్కుదారుడు. డెప్యూటీ కలక్టర్ "శ్యామ్ ముఖర్జీ"గారి ఏకైకపుత్రుడు. రెండేళ్ళప్రాయంలోనే తల్లిని పోగొట్టుకొన్న

దురదృష్టవంతుడు రతన్. భార్యపోయి నప్పటికీ ఆయన (శ్యామ్ ముఖర్జీ) ద్వితీయవివాహం చేసుకోలేదు.

కొన్నిసంవత్సరాలు కాలగర్భంలో లీనమైపోయాయ్. రతన్ పట్టభద్రుడు అయాడని పట్నంనుండి టెలిగ్రాం రాగానే, ఆ ఆనందాన్ని పట్టలేక హఠాత్తుగా తండ్రి హృద్రోగంతో మరణించాడు.

చాలాకాలం వరకూ తండ్రి చావుని రతన్, మన సారా మరచిపోలేకపోయాడు.

రతన్ పాతిక సంవత్సరాలు కూడా పైబడని యువ కుడు. అంత చిన్న వయస్సులో ఆరితేరిన కళాకారు డయాడు. అతను చిత్రించిన చిత్రా లెంతో ఆకర్షణీయంగా ఉంటాయ్. అత నొక చిత్రకారుడేకాదు — గొప్పశిల్పి! అతను మహా నైపుణ్యంతో మలచిన ప్రతిశిల్పంలోనూ, సౌందర్యంతో కూడిన సహజ, సజీవత్వం ఉట్టిపడుతూ ఉంటుంది.

ఆ విశాల భవంతిలో అత నొక్కడే ఉంటూ ఉండే వాడు. "నళిని" తప్ప అతనికి దూరపుబంధువు లెవరూ ఉన్నట్లు కనబడదు. స్వతహాగా రతన్ చాల మంచివాడు. దయ, క్షమ, కనికరం అతనిసొత్తు. అతిథి సత్కారానికి అతని మనస్సు ఆటపట్టు. లెక్కలేని బాటసార్లు ప్రతిరోజూ యింత తిని పోతూ ఉంటారు.

రతన్ అంటే ఆచుట్టుపట్ల గ్రామస్తులకు వెర్రి అభిమానం. పచ్చని వర్చస్సు—గుండ్రని ముఖం—ఉంగరాల జుత్తు—నిగనిగలాడే చెంపలు—తీర్చి దిద్దిన కనుబొమ్మలు—చూట్టానికి ఆకర్షణీయంగా కనబడే ఆజానబాహుడు. ముద్దువచ్చే సుందర విగ్రహం. ప్రసన్నత, చిరునవ్వు నిత్యం అతని ముఖంలో, నాట్యంచేస్తూ ఉంటాయ్.

అతనొక గొప్ప అందగాడని, ఆచుట్టుపట్ల ప్రతీతి.

ఆప్తులు లేని రతన్‌కి నళినే సర్వస్వమైంది. రతన్ అపురూప సౌందర్యం ఆమె అమాయకపు హృదయాన్ని ఆకర్షించింది. ఆమె నవనాగరిక సౌందర్యం అతణ్ణి తన్మయుణ్ణి చేసింది. ఆమె నవయౌవ్వనం అతని ప్రశాంత మనస్సుని కలవరపెట్టింది. ఆమె లేకుండా రతన్ ఒక శిల్పాన్ని కూడా చెక్కలేదు.

అతడు కళాకారుడు!

ఆమె కళాభిమాని!!

చుట్టూ కాకలించుకొంటూ ఉన్నట్లు కనబడే కొండల మధ్య శరత్కాలపు పౌర్ణమివెన్నెలా - నలుదిక్కులా వెండితెరలు లా కప్పబడిన దట్టమైన పొగమంచూ — ఆకాశం మీద మిలమిల మెరసే ఇల్లూ వాకిలీ లేని కోట్ల కొలదీ నక్షత్రాలూ, చంద్రకాంతిలో ప్రతిఫలిస్తూ ఉన్న హుగ్లీ నదీ—చూస్తూ, వారిరువురూ ఆ ప్రశాంతవాతావరణం మధ్య గంటలతరబడి కూర్చొనేవారు. అది విడిచి

వెళ్ళిపోతూ ఉంటే తమ సర్వస్వాన్నీ ఎవరో దొంగలించి నట్లు బాధపడేవారు.

అహోరాత్రాలు అన్నపానాలు మాని, రతన్ అతి సౌందర్యంగా మలచిన పాలరాతి శిలాప్రతిమచూసి, నళిని తన కళ్లను తనే నమ్మ లేక పోయింది. అంత అందంగా ఉంటానా అని లోలోపలే మురిసిపోయింది.

సాయంకాలం ఐదు గంటలకు బోట్ షికార్‌కి వెళతా నని చెప్పి వెళ్ళిన నళిని రాత్రి 10 గంటలైనా ఇంటికి తిరిగి రాలేదు. నౌఖర్లని పంపాడు,—వంటమనిషిని పంపాడు,— డ్రయివర్‌ని పంపాడు,—వాళ్లూ తిరిగిరాలేదు. పోర్టికోలో ఉన్న కారు తీసి శరవేగంతో హుగ్లీవైపు పోనిచ్చాడు.

ఒక స్త్రీ కళేబరాన్ని జాలార్లు నీటినుండి తీసి వడ్డున పడేశారు. ఆవిషాద దృశ్యం చూచే సరికల్లా అతని గుండె ఒక్కసారి పగిలిపోయింది. ఆమె అకాలమరణం అతని హృదయాన్ని నిలువునా చీల్చివేసింది. అంత్య క్రియలు యథావిధిగా జరిపాడు.

ఇంకీ ప్రపంచంలో కనబడేది అంతా అంధకారం!— కటిక చీకటి !! — ఎటు చూసినా శూన్యం !!! రతన్ ఉన్నట్లుండి ఆభవంతినుండి ఎక్కడికో అదృశ్యమైపోయాడు.

అప్పటికీ,......ఇప్పటికీ.........ఎప్పటికీ, కూడా అతని జాడే తెలియలేదు, ఎవరికీ—

ఆస్థికోసం క్లెయిమ్‌చేసేవా రస లెవరూ లేకపోవటం చేత, అతని అనంతరం ఆస్థిపాస్థులన్నీ గవర్నమెంట్‌పాలు అయాయ్.

కొన్ని తరాలు గడచిపోయాయ్ !!

ఇప్పుడు ఆభవంతిలో నరసంచార మున్నట్లే కన బడదు ! ! !

. ఇప్పుడు సౌధోపరిభాగంల్లో, నిశీథిలో రంగురంగుల దీపాలు వెలుగుతూ ఉన్నట్లూ, శ్రావ్యమైన సంగీతమేదో అస్పష్టంగా వినవస్తూ ఉన్నట్లూ గ్రామస్థులు చెబుతూ ఉంటారు.

పదహారు సంవత్సరాల వయస్సులోనున్న ఒక స్త్రీ రత్నం, అతి సౌందర్యంగా అలంకరించుకొని, సౌధో పరి భాగంలో సంచరిస్తూ ఉంటుందట. మసక చీకట్లో కాలి బాటగుండా నడచివెళ్ళే కర్షకజనానికి ఎవరో స్త్రీ గజ్జలు కట్టుకొని లోపలకు వెళుతూ, వస్తూ ఉన్నట్లు అస్పష్టంగా కనబడుతుందట.

వెన్నెలకురిసే పౌర్ణమినాడు తెల్లని సిల్కుచీర కట్టు కొని, శివాలయానికి పశ్చిమంగా ఉండే కాలి బాటగుండా నడచివచ్చి, మెల్లగా నడుస్తూ లోపలకు వెళుతూ ఉంటే గజ్జల శబ్దం అస్పష్టంగా వినవస్తూ ఉంటుందట.

ఇప్పుడు రహదారిప్రక్క శిథిలమై మిగిలిన ఆ జీర్ణ సౌధాన్ని చూస్తూ సాగిపోయే బాటసారులు కొన్ని క్షణాల

పాటు తల పైకెత్తి, దీనంగాచూచి, బాధగా రెండు కన్నీళ్ళు రాల్చి పోతారు......

ఒకప్పుడు కలకలలాడే ఆభవనమే నేడు గ్రామస్థులకు భరించరాని భయంతో హడల్‌కొట్టిస్తోంది. చీకటి పడితే బంగాళాకి పశ్చిమంగాపోయే కాలిబాటగుండా నడచి ఎవ్వరూపోరు సరికదా — ఆ నిర్జనగృహాన్ని కన్నెత్తి అయినా చూడరు.

ఇప్పుడు ఉమ్మెత్త, గచ్చ, నారికేళ పొదలతోనిండి ఉన్న ఆ సౌధ దీనత్వంచూస్తూ ఉంటే వినలేని విషాద చరిత్రేదో ఆపొదల మాటునుండి బయటకు తొంగిచూస్తూ ఉంటుంది—

# ఆశృతర్పణం

["నాలో మేలు కొన్న పశువాంఛలే నన్ను మృత్యు కూపంలోకి కృంగదీసి నాజీవితాన్ని కుక్కగొడుగులా పేరు ప్రతిష్ఠలు లేకుండా హరింప జేశాయ్........"

"శరీరసుఖాలు అందుకు దోహద మిచ్చాయ్— అవన్నీ నా నైతిక పతనానికి దారి చూపించాయ్"—

*   *   *

అక్కయ్య ఈ కుటుంబానికి తెచ్చిన అపఖ్యాతి అన్నయ్య జీవిత గమనాన్నే పూర్తిగా మార్చివేసింది—

ఏదో బలీయమైన బలహీనతే జానకిని పెడదారిలో నడిపించేటందుకు దోహద మిచ్చిందని అప్పుడప్పుడు అనుకొంటూ ఉంటాను—"

ఇంక చదవండి—]

సాయంకాలం నాలుగు గంటలైంది. హాస్పటల్ నుండి వచ్చి స్నానంచేసి చీర మార్చుకొని బెడ్ రూమ్‌లో అడుగు పెట్టానో లేదో పేపర్ బోయ్ కిటికీలోనుండి Hindu పేపర్ జార్చి పైకి లెక్క చల్లగా జారుకొన్నాడు.

"అస్సామ్ రైలు ప్రమాదం" అని తాటికాయ లంత అక్షరాలు తొలి పేజీలోనే కనుపించాయ్. చదవాలని ఆతృతగా పేపరు తెరిస్తే ఐదు సంవత్సరాలు క్రితం జరిగిన "జనగామ్ రైలు ప్రమాదం" జ్ఞాపకానికి వచ్చి ఏమేదో

విషాద సంఘటన నాస్మృతి పథంలో మెదిలి మనస్సుని వికలం చేసి పోయింది.

ఆ ప్రమాదం జరిగిన ఐదురోజుల అనంతరం జానకి హైద్రాబాద్ రైలు ప్రమాదంలో మరణించినట్లు ఉత్తరం వచ్చింది. ఆమె మరణం నన్నేమాత్రం కలత పెట్టక పోయినప్పటికీ ఆక్షణంలో రెండు కన్నీటి చుక్కలైనా కార్చకుండా ఉండలేకపోయాను. కనీసం ఆమె మరణానికి ఒక్క కన్నీటి చుక్కకూడా కార్చకూడదనే అనుకొన్నాను. కానీ రక్త స్పర్శతో కూడిన యేదో బలీయమైన బలహీనతే నాచేత ఆరెండు కన్నీటి చుక్కలూ కార్పించింది. ఆమె నా అక్క......రక్త స్పర్శ......కానీ ఆమె మరణం నన్నేమాత్రం కృంగదియ్యలేదు—కానీ అన్నయ్య జీవిత గమనాన్ని మాత్రం పూర్తిగా మార్చి వేసిందనే చెప్పాలి !!!

నాకు హృదయం లేదనే అనండి......లేదా నాదొక కర్కశ హృదయమనే అనండి......అక్కయ్య క్షమించ రాని అపరాధాన్నే చేసింది. నేనే కాదు చివరకు మీరు కూడా క్షమించ లేరేమో అనిపిస్తుంది — ఇలా కొన్ని నాస్మృతి పథంలో దొర్లిపోయాయ్.

ఎదురుగానున్న కిటికీ కర్టెన్ తప్పించి ఆ కాళీలో నుండి పోష్టుమేన్ ఒక నీలి కవరు పడేసి వెళ్ళిపోయాడు.

ఆత్రుతగా వెళ్ళి పరుపుమీదపడిన ఉత్తరం తీశాను. ఆ ఉత్తరం చాలా బరువుగా ఉంది. కవరు చింపాను. అందులో నుండి నాల్గుపేజీల ఉత్తరం క్రిందపడింది. ఆ ఉత్తరం జడ్జిమెంట్ లా చాలా పొడవుగా ఉంది. ఇంత ఓపిగ్గా కూర్చొని నా కెవరు రాశారా అని చివరి పేజీలోని చివరి అక్షరాలు చూశాను. ? ? ? ముత్యాల్లాంటి మూడు అక్షరాలు కనుపించాయ్.

నేనింత వరకూ ఎవ్వరి గురించి ఆలోచిస్తున్నానో... ......యే వ్యక్తి మరణవార్త విని ఒక్క కన్నీటి చుక్క కూడా కార్చలేదో.... ఆ వ్యక్తే తన స్వహస్తాలతో రాసిన ఉత్తరం అది—రాసి నామె నా సహోదరి. జానకి—

నా గుండెలు ఒక్కసారి ఆగి మళ్ళా ప్రతిధ్వనించటం మొదలు పెట్టాయ్—

ఐదు సంవత్సరాల క్రితమే రైలు ప్రమాదంలో జానకి మరణించింది—

ఐతే ఇప్పు డెవరు నాకీ ఉత్తరం రాశారూ... ...? జాని కక్కయ్య ఇంకా బ్రతికే ఉందా... ... ...?? అనే అనుమానం తోనూ ఆశ్చర్యం తోనూ... ... ...ఉత్తరం మరింత ఆత్రుతగా తీసి చదవటం మొదలు పెట్టాను.

సమాజపు వెలుగునీడల్లో
ఒక అర్ధరాత్రి......
తేదీ : 19—8—'59

చెల్లీ......సంధ్యా!

ఈ ఉత్తరం చూసిన వెంటనే నేనింకా సజీవంగానే ఉన్నానని నీకు చాలా ఆశ్చర్యం కలుగుతుంది. మరుక్షణంలోనే నామీద అసహ్యం కూడా కలగొచ్చు! ఈ ఐదేళ్ళ జీవితంలోనూ కనీసం నీ కొక జాబు కూడా రాయలేకపోయాను - రాసినా, నలిపి ముక్కలు ముక్కలుగా చించి కాలిక్రిందవేసి కసితీరా తొక్కి పారేస్తావేమో అనే భయం కొద్దీ నేను ఉత్తరం రాయటానికి సాహసించలేక పోయాను. ఇటువంటి రోజు నాజీవితంలో ఎప్పుడో ఒకప్పుడు......ఎదు రవుతుందని నాకు తెలుసు.

నేను జనగామ్ రైలు ప్రమాదంలో చిక్కుకొన్నా నని అందరూ అనుకొన్నారు. ఆ బోగీలో ప్రయాణీకు లందరూ ప్రవాహంలో పడి ప్రాణాలు విడిచారని పేపర్ లో చదివారు. వారం రోజులు గడచిన తరువాత నేను చనిపోయినట్లు మీకు ఉత్తరం వచ్చింది. ప్రపంచమంతా నేను చనిపోయినట్లే ఊహించింది, కానీ నామృత కళేబరం కోసం మీ రెవరూ ప్రయత్నించలేదు—

నేను కూడా ప్రమాదంలో చిక్కుకొన్నాను. కానీ దురదృష్ట వశాత్తూ......బ్రతికి పోయాను. శేఖర్ మాత్రం మరణించాడు— వ్యర్థురాలనై కొనఊపిరితో జీవచ్ఛవంలా మిగిలిపోయాను. హృదయ విదారకమైన ఆ విషాద దృశ్యాలకు ఒకసాక్షినై నిల్చిపోయాను !!!

జానకి చనిపోయిందని మీకు టైప్ చేసి పంపిన పాపాత్మురాల్ని కూడా నేనే—

నేను చనిపోయినట్లు నేనే మీకు ఉత్తరం రాయటానికి......... అసంఖ్యాకమైన కారణా లెన్నో ఉన్నాయ్! అవన్నీ ఇప్పుడు నీకు

చెప్పలేను......చెప్పి బరువెక్కిన హృదయంతో, నే నీ ప్రపంచంలో బ్రతకలేను—చెప్పినా నీకు అర్థం కాదు చెల్లీ !!! నేను శాఖర్‌తో లేచి పోయి......వర్ణాంతర వివాహం చేసుకొన్నాననే మచ్చతోనూ...... అవమానంతోనూ అన్నయ్య దహించిపోయి.....కుళ్ళుతూ కుమిలిపోవటం చూళ్ళేక నాఅంతంతోనే ఆమచ్చ కూడా మాసి పోతుందేమో అనే ఆశతోద్దీ నేనావిధంగా, చనిపోయినట్లు ఉత్తరం రాశాను. క్షమించు...!!!

మచ్చవస్తే మరింకపోదని తెలిసి, నే నింకా సజీవంగానే ఉన్నానని తెలియబరుస్తూన్నందుకు చింతిస్తూనే, నే నీ ఉత్తరం రాస్తున్నాను. ఆస్తి లోని వాటా కోసం కాని......ఖజానాలోని కేష్ కోసం కానీ నే నీ ఉత్తరం రాయలేను. అలా, నువ్వెన్నటికీ అపోహపడకు !!!

మళ్ళా తిరిగి మన ఊరు వచ్చి మలినపూరితమైన నా ముఖం అన్నయ్యకు చూపించేటందుకు మనస్కరించక .....మానవ సమూహానికి కొన్నివందలమైళ్ళ దూరంలో నున్న ఒక చిన్న కుగ్రామం వెళ్ళి పోయాను.

శాఖర్ ఆస్తిపాస్తులకోసం క్లైమ్ చేశాను. దానికి వారసు లెవరూ లేకపోవటంచేత అతని యావదాస్తీ నాకే చెందింది. తెల్లనివన్నీ పాలనుకొని......నల్లనివన్నీ నీళ్ళు అనుకొని భ్రమపడి నాజీవిత కర్తవ్యాన్నే మరచిపోయాను—జీవితమంటే ఒక మధుర స్వప్నమని భ్రమపడి ఎండమావుల్లో తీరని తృష్ణకోసం దిగిపోయాను......ఎంత తెలివి తక్కువపని చేశానూ...! అని అప్పుడప్పుడు అనుకొంటూ ఉంటాను—

ఉన్న ఆస్తిపాస్తులు కాస్తా సమాజానికే రాసి యిచ్చేశాను. సమాజం నన్ను తన పొత్తికడుపులో పెట్టుకొని దాచుకొంది. నన్నే కాదు—నాలాంటి వందలాది అభాగ్యురాళ్ళకు సమాధి నీడలే శాశ్వత నిలయా లయాయ్.

కాలపిశాచి కాళ్ళ క్రింద నలిగిపోయిన నా జీవితాన్ని చేతిలోకి తీసుకొని చూసుకొంటే కళ్లు రక్తాశ్రువులతో నిండి పోతాయ్.........
మనస్సు వికలమై పోతుంది—

చెల్లీ ... సంధ్యా !! నీవేకాదు ... చివరకి నా మరణానికి ఈ ప్రపంచంలోని యే వొక్కరూ ఒక్క కన్నీటిచుక్కకూడా కార్చరని నాకు తెలుసు ! కళంకి నైన నేను నిన్ను " చెల్లీ " అని సంబోధించటం అవమానంగా భావిస్తే నేను " సంధ్య " అనే సంబోధిస్తాను.

సంధ్యా ! నీవల్ల సానుభూతి పొందాలని కానీ, అన్నయ్యను క్షమాపణ కోరుకోవాలని కానీ నేను నీకు ఈ ఉత్తరం రాయలేదు.

జివితపథాల్లో నా జీవనప్రయాణం చాలాదూరం నడిచిపోయింది. అడుగడుక్కూ తగిలే పల్లేరుకాయలు తీసుకొంటూ భగవత్ సన్నిధికి దగ్గరవాలనే దీక్షమాత్రం నాలో బలీయమై నిల్చిపోయింది. అదే నా జీవన పరమావధి ... అదే ఎప్పటికైనా నాజీవిత లక్ష్యం ... దాంతో నే నే నెప్పటికైనా, నా గమ్యస్థానం చేరుకోవాలి ... !!

నాలో మేలుకొన్న పశువాంఛలే నన్ను మృత్యుకూపంలోకి క్రింగ దీసి నా జీవితాన్ని కుక్కగొడుగులా పేరు ప్రతిష్ఠలు లేకుండా హరింప జేశాయ్. శరీరసుఖాలు అందుకు దోహద మిచ్చాయ్. అవన్నీ నా నైతిక పతనానికి దారిచూపించాయ్. సరికదా, కుటుంబాని కెంతో అపఖ్యాతి తెచ్చి మరీ పోయాను.

చెల్లీ, నాలా నీజీవితాన్ని సర్వనాశనం చేసుకోకు ... !!! ఈ వాక్యం రాయటం కోసమే ఇంత పెద్ద ఉత్తరం రాశాను. నీవైనా దివ్యజీవనానికి అలవాటుపడి ఆదర్శజీవితాన్ని గడుపుతూ నేను పెట్టిన ఖాళీని పూర్తిచేసి అన్నయ్య అడుగు జాడల్లో నడుచుకొంటావని ఆశిస్తున్నాను.—

ఇంక సెలవ్

— జానకి.

ఎడ్రస్ కోసం నాకళ్ళు చాలా ఆతృతగా ఉత్తర మంతా వెతికాయ్. లేక పోవటం చూసిన మరుక్షణంలో నే ఎంతగానో నిరుత్సాహపడ్డాయ్.

అన్నయ్య ఇంకా సజీవంగానే ఉన్నాడని అక్కయ్య అనుకొంటోంది. తను వెళ్ళిన ఆరవమాసంలోనే అన్నయ్య చనిపోయాడని తనకేం తెలుసూ.........??

ఆరోజు నాకు చాలా బాగా జ్ఞాపకం !!!

జానకి లయోలాకాలేజీలో B. Sc. ఫైన లియర్ చదువుతూండేది. అప్పటికే అక్కయ్యకు చాలా సంబంధాలు వస్తూండేవి. ఒక రోజున విజయనగరం నుండి జానక్కచక్కని సంబంధం వచ్చింది. వరుడు ఎర్రిగా......పొడవుగా చాలా అందంగా ఉన్నాడు. బెనారెస్ హిందూ యూనివర్సిటీలో M. Sc. ఫైన లియర్ చదువుతున్నాడని నలభై వేల రూపాయల ఆస్తిపాస్తులు ఉన్నాయని పెళ్ళి చూపులుకి వస్తున్నాడని అన్నయ్య చెప్పాడు—

సాయంకాలం ఐదుగంట లైంది—

"నిన్ను చూట్టానికి ఒక గ్రేడ్యుయేట్......ఆయనతో కలసి అతని తల్లీ వచ్చారు...చీరకట్టుకొని చక్కగా ముస్తాబై వేగిరం రా చెల్లీ" అని చెప్పి వాళ్ళను ఆహ్వానించేందుకు హాల్లోకి వెళ్లాడు అన్నయ్య. అక్కయ్య ముస్తాబు కాకపోవటం చూసి నాకు చాలా ఆశ్చర్యం......కోపం కూడా కలిగాయ్.

అరగంట గడిచింది—

అక్కయ్య ముస్తాబు అవనూ లేదూ......హాల్లోకి వెళ్ళనూ లేదూ—

"వాళ్ళందరూ నీకోసం ఎదురుచూస్తున్నారు జానకీ, ఒకసారి వచ్చి ముఖం చూపించి పో... ..." అంటూ లోప లకి వచ్చి పరుపుమీద బోర్లా పండుకొన్న జానకి చెయ్యి పట్టుకొని లేవ నెత్తాడు. అక్కయ్య కోపంతో ఆనంద్ చెయ్యిని పురుగుని విదిలించేసినట్లు పక్కకు విదిలించేసింది.

"ఎలాగైనా నన్ని ఇంట్లో నుండి వెళ్ళగొట్టేయాలని చూస్తున్నావా ... ... ?" తాచుపాములా తల పైకెత్తి చాలా కోపంగా అంది.

జానకి అలా అన్నప్పటికీ అన్నయ్య ఏ మాత్రం చలించలేదు.

"నన్ను అపార్థం చేసుకొంటున్నావా జానకీ?" చాలా నెమ్మదిగానూ ప్రశాంతంగానూ అన్నాడు అన్నయ్య.

"నేను ఇప్పుడు పెళ్ళిచేసుకోను... మొదట వాళ్ళను ఇంట్లో నుండి బైటకు నడవమని చెప్పు..." పూర్వస్థితిలోనే ఉంటూ అందా మాటలు.

"స్త్రీ ఐ పుట్టిన తరువాత ఒకరికి ఇల్లాలై ఒకింటిని సరిదిద్దుకోవాలి. పెళ్ళి లేకుండా ఉంటే ప్రపంచం యేమను కొంటుందీ...??" అన్నయ్య మాటలు కుటుంబ సంస్కా రాన్ని వెల్లడిచేస్తున్నాయ్.

"అనవసరంగా కోపం తెచ్చుకోకు జానకీ... ఒక సారి వెళ్ళి అతని ముఖం చూసిరా...ముఖం చూస్తే నువ్వే కాదనలేవ్" అంటూ అన్నయ్య చిరునవ్వుతో రోజా

రంగులోనున్న చక్కని సిల్కుచీర తెచ్చి జానకి చేతిలో పెట్టాడు—

కోపంతో చీర కిటికీలోనుండి బైటకు విసిరికొట్టింది.

"నేను చూడను...చూడదల్చుకోలేదు. బైటకు వెళ్ల మని చెప్పు—" అక్కయ్య కంఠంలో రౌద్రం ధ్వనించింది.

"తప్పు చెల్లీ! ఇంటికి వచ్చారని చెప్పి......అంత చులకనచేసి అవమానిస్తే యింక సంబంధాలు వస్తాయా?" అంటూ అన్నయ్య ఇంకా యేమేమో చెప్పాడు.

అక్కయ్య మనస్సు యేమాత్రం చలించలేదు—

మొండిపట్టు పట్టి గదిలోనే కూర్చొంది — ఇంక చేసేదిలేక పెళ్ళిచూపులకు వచ్చిన వారికి యేదో సాకుచెప్పి నిరుత్సాహంతో బైటకు పంపేశాడు. వాళ్ళు సహించరాని అవమానంతో మెట్లు దిగి వెళ్లిపోతూంటే అన్నయ్య జాలి గానూ, బాధగానూ వాళ్ళవైపు చూస్తూ నిరుత్సాహంగా కుర్చీలో కూలబడ్డాడు.

నిస్పృహతో ఎన్ని గంటలసేపు ఆ కుర్చీలో కూర్చొ న్నాడో నేను చెప్పలేను—

నేను ఉదయాన్నే హాల్లోకి వెళ్లేసరికల్లా ఇంకా ఆనంద్ అలా కుర్చీలో కూర్చొని ఆలోచిస్తూనే ఉన్నాడు. అతని మీద విద్యుద్దీపం ఇంకా బ్రహ్మాండంగా కాల్తూనే ఉంది. కాల్చిపారేసిన సిగరెట్ పీకలూ ఖాళీ అయిన బెర్క్లీ సిగరెట్ టిన్నూ ఏష్ట్రే చుట్టూ పడి ఉన్నాయ్.

కుర్చీలో కూర్చొని కళ్ళుమూసుకొని యేదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

చటుక్కున కళ్ళు తెరచి తలెత్తి నావైపు చూశాడు. రాత్రంతా నిద్ర లేకపోవటంచేత కాబోలు కళ్ళు చాలా ఎర్రగా ఉన్నాయ్. ఆక్షణంలో ఆనంద్ ముఖం చూట్టానికి చాలా భయమేసింది.

లైటార్పి టూత్ పేస్టూ, బ్రష్షూ, టవలూ తీసుకెళ్లి టేబుల్ మీద పెట్టాను. అవి తీసుకొని బరువుగా అడుగు లేస్తూ బాత్ రూమ్‌లోకి వెళ్ళాడు.

కిటికీలోనుండి పక్కగదిలోకిచూశాను. ఇంకా జానకి నిద్రపోతూనే ఉంది.

ఆరోజు ఆదివారం.

ఆనంద్ ఆఫీసీకి పోలేదు. ఇంట్లోనే కూర్చొన్నాడు. అక్కయ్య టేబుల్ మీదనున్న ఫిజిక్సు పుస్తకం తీసే సరి కల్లా అందులోనుండి ఒక నీలి కవరు క్రిందపడింది. అదేమిటో నని ఆనంద్ ఇప్పిచూశాడు. అతని బుర్రలో కొన్ని వైళ్ళు డీకొన్నట్లైంది. సహించరాని అవమానంతో అతని కను రెప్పలు బరువుగా మూతలు పడ్డాయ్.

ఫిజిక్సులెక్చరర్ శాఖర్ జానక్కి రాసిన ఉత్తరం అది.

సాయంకాలం నాల్గుగంట లైంది.

ఎక్కడనుండో జానకి అప్పుడే శేక్స్ లోనుంచి వచ్చింది. చీరమార్చుకొని కాఫీతాగి రీడింగ్ రూమ్‌లో కూర్చొని యేదో ఇంగ్లీష్ మేగ్‌జైన్ చదువు కొంటోంది.

"జానకీ!" అని పిల్చేడు. అక్కయ్య వచ్చి కుర్చీలో కూర్చొంది.

"ఈ ఉత్తరం ఎవరు రాశారూ?" చాలా నెమ్మదిగానూ ప్రశాంతంగానూ అడిగాడు అన్నయ్య.

"ఎవరు రాస్తారూ......స్నేహితులు రాస్తారు—" అదీ అక్కయ్య సమాధానం!

సంస్కారం లేని చదువు ఎందు కనిపించింది?

"ఏమని రాశారూ......?"

"నువ్వు చదవ లేదా......?"

నేను చదివితే నిన్నెందుకు అడుగుతానూ!" నిజానికా ఉత్తరం అన్నయ్య చదవలేదు. నిర్లక్ష్యమైన సమాధానాలు జానకి నోటంట ఎన్నడూ వినలేదు. నిర్భయంగా సమాధానాలు చెప్పే ధైర్యం జానకిలో ఎలా వచ్చిందో నాకు అర్థం కాలేదు — అన్నయ్యకు ఆమాటలు చాలా బాధ కలిగించేయ్ కాబోలు — జానకిని ఇంక ఎటువంటి ప్రశ్నలూ వెయ్యలేదు. జానకి తనగదిలోకి వెళ్ళి పోయింది.

జానకి మనస్తత్వాలు రోజుకి రోజూ ఇంట్లో అందర్నీ విచిత్రానుభూతిలో ముంచివేస్తున్నాయ్. జానకి విషయంలో అన్నయ్య ఆనంద్ ఎన్నడైనా అంత

కర్కశంగా ప్రవర్తిస్తేకదూ! అక్కయ్య ఇంత నిర్లక్ష్యంగా సమాధానాలు చెప్పటానికి! ఊళ్ళో జానకి గురించి తలో క్కరూ తలొక్క విధంగా చెప్పుకొంటున్నారు. జానకి వ్యక్తి గత జీవితంలో ఎన్నో అపోహలూ...అనుమానాలూ కలి గాయ్. తను జానకిని పిలచి సరిదిద్దుకోమని కూడా చెప్ప లేదు. సరికదా ఆమెను పన్నెత్తు మాటైనా ఆడలేదు—ఈ రోజున జానకి ఈవిధంగా ఎదురు తిరగటానికి కారణం? తనకు తెలీకుండానే జానకి విషయంలో యేదో పొరపాటు చేశాడని మాత్రం తెలుసుకొని తల్లడిల్లి పోయాడు!!! యే కారణమై యుంటుందో తను రూఢిగా చెప్పలేడు.

ఆనంద్ సవతి అన్న అని...ఆస్తిపాస్తులన్నిటికీ తనే ఏకైకవారసుడనే ఈర్ష్యాభావం అక్కయ్యలో చాలా ఉన్నట్లు కనబడింది. అలాగని అన్నయ్య మమ్మల్ని నిరా దరణతో నిర్లక్ష్యంగా చూసిన సంఘటనలు మచ్చుకైనా ఒక్కసారి కనబడలేదు—

ఒక రోజున జానకి తన లెదర్ సూట్ కేస్ నిండా బట్టలు పెట్టుకొని. గదిలో నుండి హాల్లోకి వచ్చింది. అన్నయ్య ప్రశాంతంగా ఫేన్ క్రింద పేపరు చదువుకొంటున్నాడు. జానకి రాక ఆనంద్‌కి కొద్దిగా అంతరాయం కలిగించిందనే చెప్పాలి. చదువుతూన్న పేపర్ టేబుల్ మీాద పడేస్తూ ఒక సారి తల పైకెత్తి జానకి ముఖంలోకి యేదో ఆలోచనగా చూస్తూ తల క్రిందకు వంచుకొన్నాడు.

అక్కయ్య వేషభావాలు చూస్తే యేదో పెద్ద ప్రయాణ సన్నాహంలో ఉన్నట్లు కనబడింది. ఆరోజు రాత్రి మెయిల్లో శాఖర్‌తో కలసి అలహాబాద్ వెళ్ళిపోవాలని నిశ్చయం చేసుకొన్నట్లు అన్నయ్యకు రెండు రోజులు క్రితమే తెలుసు... ...

"వెళుతున్నావా జానకీ... !" అన్నయ్య మాటల్లో కోపం లేదు—సరికదా ప్రసన్నత ఉట్టిపడుతోంది. జానకేమీ సమాధానం చెప్పలేదు — సరికదా దించిన తల కూడా ఎత్తలేదు.

"ఒకప్పుడు పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్న ఈ కుటుంబం ఇప్పుడు నైతికంగా పతనమై పోతోంది !... ..."

ప్రతిష్ఠ పోతే మరింక రాదు !... ... ...

మచ్చ వస్తే మరింక పోదు !!... ... ...

బాగా ఆలోచించుకో జానకీ —" మాటల్లో ఎటువంటి కోపం కూడా లేదు. అంత నిర్మలవదనంతో అన్నయ్య ఎన్నడూ మాట్లాడినట్లు చూళ్లేదు.

అక్కయ్య ముఖం అవమానంతో నల్లగా మాడి పోయింది.

"శాఖర్‌ని హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నావా జానకీ ... ?"

అవును అన్నట్లు తల ఆడించింది జానకి.

కర్కశంగా ప్రవర్తిస్తేకదూ! అక్కయ్య ఇంత నిర్లక్ష్యంగా సమాధానాలు చెప్పటానికి! ఊళ్ళో జానకి గురించి తలో క్కరూ తలొక్క విధంగా చెప్పకొంటున్నారు. జానకి వ్యక్తి గత జీవితంలో ఎన్నో అపోహలూ...అనుమానాలూ కలి గాయ్. తను జానకిని పిలిచి సరిదిద్దుకోమని కూడా చెప్ప లేదు. సరికదా ఆమెను పన్నెత్తు మాటైనా అడలేదు—ఈ రోజున జానకి ఈవిధంగా ఎదురు తిరగటానికి కారణం? తనకు తెలీకుండానే జానకి విషయంలో యేదో పొరపాటు చేశాడని మాత్రం తెలుసుకొని తల్లడిల్లి పోయాడు!!! యే కారణమై యుంటుందో తను రూఢిగా చెప్పలేడు.

ఆనంద్ సవతి అన్న అని...ఆస్తిపాస్తులన్నిటికీ తనే ఏకైకవారసు డనే ఈర్ష్యాభావం అక్కయ్యలో చాలా ఉన్నట్లు కనబడింది. అలాగని అన్నయ్య మమ్మల్ని నిరా దరణతో నిర్లక్ష్యంగా చూసిన సంఘటనలు మచ్చుకైనా ఒక్కసారి కనబడలేదు—

ఒక రోజున జానకి తన లెదర్ సూట్ కేస్ నిండా బట్టలుపెట్టుకొని. గదిలో నుండి హాల్లోకి వచ్చింది. అన్నయ్య ప్రశాంతంగా ఫేన్ క్రింద పేపరు చదువుకొంటున్నాడు. జానకి రాక ఆనంద్‌కి కొద్దిగా అంతరాయం కలిగించిందనే చెప్పాలి. చదువుతూన్న పేపర్ టేబుల్ మీద పడేస్తూ ఒక సారి తల పైకెత్తి జానకి ముఖంలోకి యేదో ఆలోచనగా చూస్తూ తల క్రిందకు వంచుకొన్నాడు.

అక్కయ్య వేషభాషలుచూస్తే యేదో పెద్ద ప్రయాణ సన్నాహంలో ఉన్నట్లు కనబడింది. ఆరోజురాత్రి మెయిల్లో శాఖర్‌తో కలసి అలహాబాద్ వెళ్ళిపోవాలని నిశ్చయం చేసుకొన్నట్లు అన్నయ్యకు రెండు రోజులు క్రితమే తెలుసు... ...

"వెళుతున్నావా జానకీ... !" అన్నయ్య మాటల్లో కోపంలేదు—సరికదా ప్రసన్నత ఉట్టిపడుతోంది. జాన కేమీ సమాధానం చెప్పలేదు — సరికదా దించిన తల కూడా ఎత్తలేదు.

"ఒకప్పుడు పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్న ఈ కుటుంబం ఇప్పుడు నైతికంగా పతనమై పోతోంది!... ..."

ప్రతిష్ఠ పోతే మరింక రాదు!... ... ...

మచ్చ వస్తే మరింక పోదు!!... ... ...

బాగా ఆలోచించుకో జానకీ —" మాటల్లో ఎటువంటి కోపం కూడా లేదు. అంత నిర్మలవదనంతో అన్నయ్య ఎన్నడూ మాట్లాడినట్లు చూళ్లేదు.

అక్కయ్య ముఖం అవమానంతో నల్లగా మాడి పోయింది.

"శాఖర్‌ని హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నావా జానకీ ... ?"

అవును అన్నట్లు తల ఆడించింది జానకి.

"వివాహం చేసుకొంటానని అన్నాడా లేక శాశ్వితంగా—"

మాట పూర్తి చెయ్యలేదు ఆనంద్.

అన్నయ్య మాటలను అవమానంగా భావించి అన్నయ్యను చురచురా చూసి కోపంగా తల విదిలించింది. ఎంతైనా ఆనంద్ సవతిఅన్న అనే భావం ఉందికదూ...!

"అతని కోసం చివరకు నీ ప్రాణాలనైనా త్యాగం చెయ్యగలవా జానకీ...?" ఆ ప్రశ్నకు అక్కయ్య ఆత్మలో విరుద్ధ సంఘర్షణలు చెలరేగాయ్—జవాబు చెప్ప లేక పోయింది.

"నీది త్యాగపూరితమైన ప్రేమకాదు జానకీ... !"

అక్కయ్య మండిపడ్డాది.

"అప్రస్తుత ప్రస్తావనలతో అమూల్యమైన కాలాన్ని వ్యర్థపరచొద్దు ... !" నిర్భయంగా అన్న ఆ మాటలు వింటూంటే అక్కయ్యమీద నాకు చెప్పలేని అసహ్యం, రోతా కలిగింది.

ఆనంద్ ఇంకేమీ మాట్లాడలేదు.

ఇంకవెళ్ళొచ్చు అన్నట్లు జానకి కళ్ళల్లోకి చూసి నిస్పృహతో సోఫాలో కూలబడ్డాడు.

అన్నయ్య వేసిన ప్రతిప్రశ్నా అక్కయ్య భవిష్యత్ జీవిత నిర్మాణానికి బలమైన కాంక్రీట్ పునాదులుగా

నా కనిపించాయ్. అన్నయ్యను పూర్తిగా అర్థం చేసుకో లేకపోయింది జానకి—

"డబ్బు కావాలి……తాళా లియ్యి……"చాలా కోపంగా అడిగింది. అన్నయ్య ఆస్తిపాస్తులు మీాద తనకి సర్వాధికారాలూ ఉన్నట్లు ధ్వనించిం దామె కంఠం—

"డబ్బా…!" మామూలు ధోరణిలోనే అన్నాడు అన్నయ్య. కానీ తన నేదో అవమానం చేస్తూన్నట్లుగా భావించింది అక్కయ్య.

"నన్ను అన్యాక్రాంతం చేసి మా అమ్మ నాపేర బేంకులో వేసిన ఆరువేల రూపాయలూ నీ స్వంతం చేసు కోవాలని చూస్తున్నావా ?"

రెట్టింపు స్వరంతో గర్జించింది అక్కయ్య—

అన్నయ్య ఆమాటలుకు మరింత బాధపడ్డాడు.

"అక్కయ్య……యేంటా మాటలు… ?" పళ్ళు పటపట కొరుకుతూ అన్నాను. అన్నయ్య మా సమక్షంలో నిల్చొన్నాడు. లేకపోతే అక్కయ్యను నిలువునా పీక నులిపి ఉండేదాన్ని—

"నువ్వు పెడమార్గంలో నడవడమే కాకుండా, తిరిగి అన్నయ్యను కూడా నిందిస్తున్నావా … …? పట్టరాని కోపంతో అన్నాను ఈ మాటలు……

"నా వ్యక్తిగత విషయాల్లో నువ్వు జోక్యం కలుగ జేసుకోకు చెల్లీ !" నాకళ్ళల్లోకి ఉరిమి చూసింది,

పాపకూపం లోకి దిగజారిపోతూన్న అక్కయ్యను చేతులతో వెనక్కి నెట్టా లనుకొన్నాను—కానీ,—

అన్నయ్య విశాలహృదయాన్ని అక్కయ్య అర్థం చేసుకో లేక పోయింది. తన డబ్బు అన్యాక్రాంతం చేసి ఆక్రమించుకొంటా డని అపోహపడినందుకు నాకు అక్కయ్య మీద చెప్పలేని అసహ్యం కలిగింది. ఆమె ముఖం చూట్టానిక్కూడా నా మనస్సు అంగీకరించ లేదు. "చదువు కొన్నందుకు మంచి ప్రాజ్ఞురాల వవుతావని కుటుంబానికి పేరుప్రతిష్ఠలు తెస్తావని ఆశించాను — నీ భవిష్యత్ మహో జ్వలంగా ప్రకాశిస్తుందని ఊహించాను—"

"మంచిమంచి మాటలు చెప్పి మరిపించాలని చూస్తు న్నావా ?" అక్కయ్య మాటలు క్షణక్షణానికీ మితిమీరి పోతూన్నట్లు కనుపించాయ్.

"చేసినమేలు మరచి కృతఘ్నురాలవైనందుకు చాలా చింతిస్తున్నాను." అంటూన్న అన్నయ్య మాటల్లో అవ మానం ధ్వనిస్తోంది. ఆ క్షణంలో శరీరంలోని రక్తప్రవాహ మంతా కళ్లల్లోనే ఉన్నట్లు పొడగట్టింది. మరుక్షణంలోనే దీర్ఘనిస్వాస విడిచాడు—

"జానకీ... ... ఇవిగో, తాళాలు ... ...నీ జీవిత సౌఖ్యానికి అవసరమైన డబ్బు తీసుకొని వెళ్ళొచ్చు !! ఆ ఆరువేల రూపాయలే కాదు! — మరొక పదివేల రూపా

యలు కూడా తీసుకొనివెళ్లు—!!! అంతే కాదు - మీ అమ్మ తాలూకు నగలు ఐరన్ సేఫ్‌లో యెన్నో ఉన్నాయ్—అవన్నీ కూడా తీసుకొనివెళ్ళు - మరొక విషయం !!! నా వైపుచూడకు - మళ్ళా ఈ తెనుగు గడ్డమీద నాకనుచూపు మేర ఎక్కడా కనబడకు - చెడి మళ్ళా తిరిగి రావద్దు ! నీ క్షేమం గురించి పొరపాటునకూడా నా కెన్నడూ ఉత్తరాలు రాయొద్దు—!!! " ఆయాసంతో అలసిపోయి కుర్చీలో చలనంలేకుండా పడిపోయాడు - వెంటనే తాళాలు తీసుకొని అవసరమైనంత డబ్బూ వస్తువులూ మోయ గలిగినంత బరువు సూట్ కేస్‌లో పెట్టుకొని టేక్సీఎక్కి వెనుదిరిగైనా చూడకుండా స్టేషన్ వైపు వెళ్ళిపోయింది—

మర్నాడే జానకి లేచిపోయిం దని ఊళ్ళో గుప్పుమంది. ఫిజిక్సు లెక్చరర్ శాఖరాన్ని తీసుకొని అలహాబాద్ వెళ్ళి పోయిం దని కాలేజీ అంతా మారుమ్రోగింది. వీధి వీధీ వాడ వాడా విచిత్రంగా చెప్పుకొన్నారు.

ఇప్పు డందరూ ఆ యింటిని వేలెట్టి చూపిస్తారు—

అగ్నిహోత్రం లాంటి స్త్రీ లని, పేరుప్రతిష్ఠలు సంపాదించుకొన్న ఈ కుటుంబంలో జానకి గమనం—మాసిపోని మచ్చగా నిల్చిపోయింది ... ...

అక్కయ్య ఈ కుటుంబానికి తెచ్చిన అపఖ్యాతి అన్నయ్య జీవిత గమనాన్నే పూర్తిగా మార్చివేసింది.

—ఏదో బలీయమైన బలహీనతే జానకిని పెడదారిలో నడిపించే టందుకు దోహద మిచ్చిందని అప్పుడప్పుడు అనుకొంటూంటాను.

వైజాగ్ మెడికల్ కాలేజీలో మెడిసిన్ ఫైన లియర్ చదువుతున్నాను. అన్నయ్య హఠాత్తుగా చనిపోయా డని మెడికల్ కాలేజీకి టెలిగ్రామ్ వచ్చింది. నా తలమీాద హఠాత్తుగా పెద్ద పిడుగు పడ్డ ట్టైంది——

ఇప్పుడు అన్నయ్య లేని లోటు అడుగడుగునా నన్ను కృంగదీస్తుంది. ఇంట్లోని ప్రతివస్తువూ అన్నయ్యలేనిలోటుని జ్ఞాపకం చేస్తాయ్.

అమూల్యమైన పితృస్థానం వెల్తి ఐనప్పుడు కూడా నే నంతగా బాధపడలేదు——కానీ,......కదలిక లేని నిశ్చలమైన చూపులూ .....అందులో నుండి వెలువడే నిర్మలమైన ప్రేమా.......నా వంటరి జీవితంలోని బాధల్ని మరపించి......శాంతిని చేకూరుస్తాయ్.

జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కొనేందుకు తగిన ధైర్యాన్ని ప్రసాదించమని దైవాన్ని ప్రార్థిస్తూ అన్నయ్య ఆత్మశాంతికోసం రెండు అశ్రుతర్పణాలు విడిచాను......

# నిగూఢ రహస్యం

[కట్నాలూ, కానుకలూ పుచ్చుకొనేవారం కామని, తమకు మోడరన్ వ్యూస్ ఉన్నట్లూ........ చెప్పేవారు. వారివి మహోన్నతమైన ఆశయాలని తొలిపలుకులోనే అర్థమైంది.

వరకట్నాలు విలయతాండవం చేసే స్వార్థభూయిష్టమైన ఈ సమాజంలో అటువంటి నవభావాలు కల నలుగురు యువకులుంటే మగ జాతికే ఎంతో ప్రతిష్ఠ!

ఈ పీడిత ప్రజానీకానికి అటువంటి ఆదర్శ హృదయులు ఎందరైనా కావాలనిపించింది.

ఇక. చదవండి —]

భవిష్యత్ ఊహించినంత తీపిగానూ, కలలు కన్నంత ఆనందంగానూ ఉండదు. జీవిత మెప్పుడూ ఆనందంగానే గడచిపోతుందని అనుకోవటం శుద్ధ తెలివితక్కువ! చీకటి వెలుర్లు లేని జీవితం ఒక జీవితం కాదు. కష్టసుఖాలు కలియకే జీవితమన్నారు పెద్దలు!! కష్టసుఖాలును జీర్ణించుకొన్న వ్యక్తే జీవితాన్ని సార్థకం చేసుకొన్న వ్యక్తి!

కష్టాలు లేక పోతే జీవితాల కొక విశిష్ఠత ఉండదు కాబోలు!!

జీవిత సుడి గుండాలమధ్య చిక్కుకొన్న నా జీవనావను వడ్డుకు చేర్చుకో లేక పోయాను. విధే ఒక వెర్రిగాలై వీచింది—అదే ఒక పెనుతుపానులా ప్రబలింది... చివరకు

అదే నడి సముద్రంలో నా జీవనావను ముంచి మరీ పోయింది. కానీ......పిరికి పందనై జీవితాశను మాత్రం వదలుకోలేదు !!

సంపన్న కుటుంబంలోనే పుట్టాను. పుట్టిన వెంటనే జ్యోతిష్కులు మహా అదృష్టవంతురాల్ని అన్నారు. జాతక చక్రం వేస్తూ నాదొక మహోజ్వల భవిష్యత్ అన్నారు. అలా నా జాతకచక్రం మీదే రాశారు కాని నా నుదుటి మీద రాయలేదు......విధాతకలం నా నుదరుపై వక్రంగా నడిచిందనీ, దౌర్భాగ్యురాల్ని అవతాననీ, వాళ్ళ కేం తెలుసూ ? ... హస్తసాముద్రికాని కూడా అందకుండా, లిఖించాడు !

కొద్దిపాటి చదువుతోనే మా నాన్న నన్ను స్కూల్ కి స్వస్తిచెప్పించి ఇంట్లో కూర్చో పెట్టారు. పెద్దదాన్ని అయానని పెళ్ళిచేసెయ్యాలని ఇంటా బయటా కూడా అందరూ మా నాన్నతో అంటూండేవారు. కానీ మా అమ్మ మాత్రం అలా అంటూండే వారిని ఏవగించుకొనేది.

శరీరంలో వింత మార్పులు.........

మానసికంగా మధురస్మృతులు......

అందని ఆనందాన్ని పొందాలని ఏదో ఆవేదన... తీరని కోర్కెల గురించి ఆలోచిస్తూ ఉంటే మనసు తీయని ఊహల్లో ఉద్రూతలూగేది.

నన్ను చూసి మా నాయనమ్మ ప్రతిరోజూ మా నాన్నగారితో పోట్లాడేది; నాకు త్వరగా సంబంధం చూడమని.

ఒక రోజున మా నాయనమ్మ నిర్బంధంమీద మా నాన్న విజయవాడ వెళ్ళి చక్కని సంబంధాన్ని చూసి వచ్చారు. ఆ వరుని అందచందాలూ, రూపురేఖలూ వర్ణిస్తూ ఆరుగంటలసేపు అనర్గళంగా లెక్చరిచ్చారు. భేష్! చక్కని సంబంధం వచ్చిందర్రా; చేసెయ్యండి – అన్నా రందరూ ... అందుకు నాయనమ్మ సెకెండు చేసింది. నా మనస్సు కూడా అందుకు ఏకగ్రీవంగా ఆమోదించింది. కానీ ... మా అమ్మ – ఆమె ... ఆమె ... భగవంతుని దయవల్ల ఇక్కడ లేదు. మానాన్న తలమీద కూర్చొని తిప్పి కొడుతూఉన్న శనేశ్వరుని దింపటం కోసం ... ... డబ్బా నూని పట్టుకొని మందపిల్లి వెళ్ళింది.

వస్తున్నామని కబురు పంపనూ లేదు. ఉత్తరం రాయనూ లేదు – చటుక్కున ఒకరోజున పెళ్ళిచూపులకు వచ్చేశారు.

నన్ను సన్నజాజి ఆర్చి క్రింద చూసీ చూట్టంతోనే చిక్కని చిరునవ్వు నవ్వేరు...ఆ నవ్వు చిక్కని పాలలాగే ఉంది.

అది అందుకొని ఒక్క అడుగులో వంటింట్లో ఉన్న నానమ్మ దగ్గరకి పారిపోయాను.

"ఎవరే వచ్చారూ... ...?" అంది.

నాకు సిగ్గేసింది...ి..చెప్పలేకపోయాను.

నాయనమ్మ ఆందోళనగా పైకెళ్ళి వాళ్ళను లోపలకు తీసుకువచ్చి అర్జంటుగా నాన్నకి కబురు పంపింది ఆఫీసుకి.

ఆయనొక పెద్ద మిలటరీ ఆఫీసర్. చూట్టానికి టిప్ టాప్‌గా ఉన్నారు. చదువుకి తగ్గ హోదా—హోదాకి తగ్గ ఐశ్వర్యం ... ... ఐశ్వర్యానికి తగ్గ అర్హతలు ... అన్నీ ఉన్నాయ్ అతనిలో......

ఆరడుగుల విగ్రహం !! బలంగానూ ధృడంగానూ చూట్టాకి ముద్దొచ్చే ముఖవర్చస్సు......ఆయన నడుస్తూ ఉంటే ఏదో అధికారం, ఠీవి, అతని అడుగుల్లో ఉట్టిపడుతూ ఉంటుంది.

ఆయన్ని చూస్తూ ఉంటే మహాకవులు షెల్లీ బైరన్లు జ్ఞాపకానికి వస్తారు. ప్రబంధాల్లో నేను అటువంటివారినే చూశాను ... ఇప్పుడు పొందబోతున్నాను కూడా—

ఆయనతోపాటు పెళ్ళిచూపులకు మరొక నలుగురు పెద్దమనుష్యులుకూడా వచ్చారు. అందులో ఒకాయన బాగా యువకుడు. ఈయనపక్కనే కూర్చున్నా డతను. తక్కినముగ్గురూ వృద్ధులు.

ఆ పెద్ద మనుషుల్లో ఒకాయన బాగా వృద్ధుడు. ఆజానుబాహుడు ... చెయ్యెత్తు మనిషి. ముడుతలుపడ్డ శరీరం శల్యాన్ని పట్టుకొని ఇంకా ఎందుకో వేళ్ళాడుతోంది.

బాగా నెరసిన పొడుగాటి గడ్డాన్ని ఒకసారి ఎడంచేత్తో సవ
రించుకొని ... పట్టుకొన్న వెండి పొన్నుకర్ర నేలమీద పెట్టి,
కుర్చీలో కూర్చొని నిస్త్రాణతో ఒకసారి వేడిగా నిట్టూర్చారు.

ఆయన వయస్సు వంద సంవత్సరాలకు పైబడే
ఉంటుందని, నామనస్సు తొలిచూపులోనే అంచనా వేసింది.
సుఖ, దుఃఖాలను బాగా జీర్ణంచేసుకున్న ట్లున్నాయ్ అతని
చూపులు...ఆ వృద్ధులే ఆయన తండ్రిగారు కాబోలు అని
నామనస్సు ధృఢనిశ్చయం చేసింది.

వర సమేతంగా పెళ్ళిచూపులకు వచ్చిన గౌరవస్థు
లైన ఆపెద్దలను మా నాన్న ఎంతో గౌరవంగా ఆహ్వానించి
గొప్ప మర్యాదలు చేశారు.

పెళ్ళిచూపు లై పోయాయ్!

నేను లోపలకు వెళ్ళిపోయాను. అందరూ చిరు
నవ్వుతో కుర్చీల్లో నుండి లేచారు. రాత్రి మెయిల్లో
విజయవాడ వెళ్ళిపోతా మన్నారు. కానీ నాన్నగారు వాళ్ళ
నెవ్వరినీ వెళ్ళనియ్యలేదు. ఆరోజురాత్రికి ఉండి భోజనం
చేసి,మర్నాడు ఉదయం జనతాలో వెళ్ళమని చెప్పారు.
ఉదయాన్నే ప్రధానం చేసుకొని వెళ్ళిపోమని పట్టుపట్టారు.

చివరకి నాన్నగారి పట్టే నెగ్గింది.

ఆరాత్రి ఉండిపోదా మని ముసలాయన నిశ్చయం
చేస్తూ "కూర్చోండి" అంటూ తక్కిన వారిని సముదా
యించారు,

మా (B. C.) బీ. సీ. నాటి పాతగడియారం తన వృద్ధాప్యాన్ని జ్ఞప్తికి తెస్తూ, నీరసంగా అరడజను సార్లు మూల్గింది.

ఆయనా, ఆయన స్నేహితుడు మరొకతనూ, అజంతాలో ఆడుతూన్న "అనార్కలీ" కి వెళదామని ప్రోగ్రామ్ వేసుకుంటూ ఉన్నట్లు వారిరువురూ బాత్ రూమ్‌లో మాట్లాడుకొన్న మాటలు బట్టి తెలిసింది. ముఖం కడుక్కొని ఇద్దరూ బయటకు వచ్చారు.

అందంగా పెరిగిన క్రాఫ్ దువ్వుకొంటూ ఉన్న అతన్ని ఎంత చూసినా ఇంకా చూడాలనే అనిపించింది.

ఇంతలో చటుక్కున ఆయన ఒకసారి తన రిస్టువాచి వైపు చూసుకొని ఆయన తండ్రిగారిదగ్గరకు వెళ్ళి ఏంటో చెప్పారు. మరుక్షణంలో ఆయన పర్సుతీసి సరిక్రొత్తది పది రూపాయిల నోటు అతనిచేతిలో పెట్టారు. నేను చూస్తున్నా నని కాబోలు... కుడి చేత్తోవద్దంటూ తమాషాగా ఎడం చేత్తో అందుకొని జేబులో కుక్కేసుకొన్నారు.

చటుక్కున నాకు నవ్వొచ్చేసింది.

కొంచం సిగ్గుతో తల వంచేసుకొని... ...నా ముఖం చూట్టానికి సంకోచించి... ... స్నేహితునితో కలసి బయటకు పోయారు.

ఆదార్భాగ్యపు సినీమాకి ఈ రోజునే వెళ్ళాలా... రాక రాక ఎంతోదూరం నుంచి వచ్చేరు. ఎంతో ప్రయాణ

బడలిక మీద ఉన్నారు. హాయిగా హాల్లో కూర్చుని ఆ పది గంటల వరకూ వాళ్ళతో కబుర్లు చెప్పాలనిపించింది నాకు.

వెంటనే షెల్ఫులోనున్న "విరల్డ్ విండ్" నోవల్ తీశాను. పేజీలు వేళ్ళమధ్య నలభై తిరిగిపోయాయే కాని చదివిన కథేమీ బుర్రకెక్కలేదు. కథానాయకి సుడిగాలిలో చిక్కుకొని ఆకాశంలోకి ఎగిరిపోతోంది...... ఇవతల నేను ఆలోచనలో చిక్కుకొని ఏ స్వర్గసీమలకో వెళ్ళిపోతున్నాను. ఇంతలో ఎవరో తలుపు తట్టినచప్పుడైంది మళ్ళా ఈ భౌతిక ప్రపంచంలో పడ్డాను —

ఇంకెవరు ? ఆయనే......

వీధికిటికీలోనుండి ఈవినింగ్ పారిస్ పరిమళం వచ్చి నన్ను తాకలించుకొంది ...... తీయని ఊహలతో కొన్ని క్షణాలపాటు పరుపుమీద మతి పోయిందేమో అనిపించింది. చటుక్కున పుస్తకం టేబిల్ మీదకువిసరి చెలాకీగా లేచాను. నిస్సందేహంగా అతనే... అతనే......ఏం చెయ్యాలి ?.... ఏంచెయ్యాలి......??

ఆయనదే ఆ గొంతుక ! అయ్యో పాపం !! ఎలాగా ? వెళ్ళాలా మానాలా ? తియ్యాలా వద్దా ? మళ్ళా చప్పుడు. నేనొక్కర్తినే మెలుకువతో ఉన్నాను నా గదిలో...... ఇంతలో నాన్న లేచి తలుపు తీశారు.

"అమ్మయ్యా" అంటూ ఒకసారి నిట్టూర్చి కుర్చీలో కూలబడ్డాను......

ఏడుగంటలకే ఆ పెద్దవాళ్ళు ముగ్గురూ భోజనాలు చేసి మే డెక్కి గుర్రులుతీసి నిద్రపోతున్నారు.

వినోదంచూట్టానికి వెళ్ళి "అనార్కలీ" ని చూసిన ఈ మిత్రద్వయం ఏదో "ఇంటాక్సిగేషన్"లో చప్పచప్పగా భోజనాలు చేశారు.

తాంబూలం వేసుకుంటూ యిద్దరూ వాకట్లో ఉన్న కుర్చీల్లో కూర్చొన్నారు. చిత్రశ్రేణిలో మహోన్నతమైన శిఖరంమీద కూర్చోపెట్టి అనార్కలీని రెండుపొగడ్తలు పొగిడారు. ఆ పొగడ్తలికి చంకలు గుద్దుకొంటూ అనార్కలీ కాలుజారి, అయితే కిందపడి చస్తుందేమో అనుకొన్నాను. చస్తే పోతుంది......సలీంకి మరొకర్తి ఒస్తుంది?

ఇంతలో నాన్నగారు వారిదగ్గరకు వెళ్ళి, నేనున్న గదికి పక్కగదినే వాళ్ళను బస చేసుకోమని చెప్పారు. చచ్చానుర్రా భగవంతుడా అనుకొన్నాను.

పదిన్నర అయింది.

వాళ్ళిద్దరూ గదిలోకివచ్చి మంచాలుమీద మేనువాల్చారు.

మేం ఇచ్చిన మంచం ఆయనకు సరిపోలేదు కాబోలు! అతని పొడవుకు తగ్గమంచం కాకపోవటంచేత పొడుగ్గాఉన్న స్టూల్ బల్ల తీసుకొని అందుమీద కాళ్ళు పెట్టుకొన్నాడు.

తలుపు సందుల్లోంచి అతని దీర్ఘకాయం చూస్తూంటే నాకెంతో ఆశ్చర్యం వేసింది.

ఆయన స్నేహితుడు ఈయనగారి వైపు వంగి... యు - ఆర్ - లకీ– శాస్త్రీ; నువ్వు మహా అదృష్టవంతుడివి. చాలా అందమైన అమ్మాయే దొరికిందోయ్ ... నీదే అదృష్టం, అంటూ నా రూపురేఖలు మీద అరగంటసేపు రెస్టు లేకుండా ఆస్నేహితుడు లెక్చర్ దంచేశాడు. అతను అలా అంటూ ఉంటే ఎందుకో నాకింకా వినా లనిపించింది.

నీ ఊహ లన్నిటికీ సరిపడిన అమ్మాయే దొరికిందోయ్," అంటూ సంభాషణకి కామాపెట్టి పెదెమలు చప్పరించాడు.

"మిష్టర్ రఘూ, నిజం చెబుతా వినూ ... నమ్మితే నమ్ము—లేకపోతే మానేయ్, నా ఐదేళ్ళ అన్వేషణలోనూ ఇంత చక్కని అమ్మాయిని నే నెక్కడా చూళ్లేదోయ్..." అంటూ ఈయనగారు మొదలు పెట్టారు.

"ఆహా!... ...ఏం అందం... ... ఏం రూపూ... ట్రిమెండస్ ... ... వెరీ ఫెయిర్ డేమ్‌సెల్ ... ఆమె పాటకి ఎండినమోళ్ళు సహితం చిగురుస్తాయోయ్ మునివరా!" ఏదో మధురానుభూతిలో మునిగిపోతూ అఖండమైన లెక్చర్ ... ...ఎంత సేపో చెప్పలేను.

మధ్యలో నోరు నొప్పెట్టింది కాబోలు... మంచినీళ్లు

ఇచ్చే దిక్కైనా లేక పోయారు ఆ గదిలో — వెంటనే గొంతు కెండి పండుకొన్నారు మిత్రులు.

అరగంట గడిచింది.

ఈయనగారి నిద్రకి జోలపాట పాడుతూ ఉన్నట్లు ఆయనగారి గుర్రు నాగదిలోకి మోతపెడుతూ మారు మ్రోగుతూంది. ఆరాత్రల్లా నాకు ఏవో మధుర స్మృతులతో కలతనిద్రే అయింది.

భళ్ళున తెల్లారింది. నాయనమ్మ ఇంకా చీకటి ఉండగానే నన్ను లేపి తలంటి నీళ్ళుపోసేసి క్రొత్త చీర కట్టించింది.

"ఇదంతా యేంటే" అన్నాను తెల్లబోతూ......

"అలా నిలువు గుడ్లేసుకొని చూస్తావేం? ...? ఇవ్వాళ ప్రధానం అని నీకు తెలీదటే" అంది నా బుగ్గలు నొక్కుతూ.

"అవును......అవును......"అన్నాను నిద్రమత్తు విరిగి.

ఉదయం ఆరుగంటలకే "బూల్ చెంద్" కొట్లో కెళ్ళి ఖరీదైన ఎర్రని కాశ్మీర్ సిల్కుసారీ, తెచ్చారు ఒకాయన.

అప్పటికే ఏడుగంట లయింది.

అప్పుడే నిద్రనుంచి మెలుకువవచ్చి తీరుబడిగా లేచా రా ఘుష్టుపురి మిత్రులూ!! ఆయనగారు ముఖం కడుక్కొంటూ

ఉంటే పురోహితుడు వచ్చాడు. ఒకసారి వరుని చూడాలని మనసు కలిగింది కాబోలు; అతని దగ్గరకు వెళ్ళి అతని చుట్టూ ప్రదక్షిణం చేస్తూ అత నొక్క మ్యూజియమ్‌లోని మృగంలా ప్రతి అవయవాన్నీ గుచ్చి, గుచ్చి చూస్తున్నాడు ఆయన.

చటుక్కున ఆయన వెనక్కు తిరిగి విభూతి పిండీ కట్లుతో ఉన్న ఈ అవతారాన్ని చూసి ఎందుకో చిన్న చిరునవ్వు నవ్వేరు.

ఆయనగారిముందు ఇతనో దోమలా కనబడుతున్నాడు. కొంపతీసి ఆ బలమైన కాలుకింద పడితే కసుక్కున నలిగి పోతాడేమో అనుకొన్నాను.

ఆ చూపులు ...... ఈ అవధాన్లుగారికి అవమానా స్త్రంగా తగిలేయ్ కాబోలు! వెనక్కు తిరిగి చూస్తూ హాల్లోకి వెళ్ళిపోయేలోపున అరడజనుసార్లైనా వెనుదిరిగి చూశారు.

ఆ ముసలాయన బజారుకు టేక్సీలో వెళ్ళి, ఖరీదైన రెండుజతల గాజులూ, సన్నని డైమండ్ నెక్ లెస్ తెచ్చి వెండి పళ్ళెంలో పెట్టారు. ఎనిమిది అయ్యేసరికల్లా ప్రధానం అయి పోయింది. ఆ చీరా, ఆ నగలూ కట్టుకొని చక్కగా ముస్తాబై నా గదిలోకి వెళ్ళిపోతూ ఉంటే...... కిటికీలోనుండి వంగి, వంగి నావైపు చూట్టంమొదలుపెట్టా రాయన...... ఆయన చూపులు మోహపునిగ్గులుకూ మత్తెక్కిస్తున్నట్లు ఉన్నాయ్.

కళ్ళతోనే యేవేవో ఊహలు చెప్తూ... ...బరువుగా ఒక్క చిరునవ్వు నవ్వేరు.

సిగ్గు ముంచుకొచ్చింది ... ... చటుక్కున ముఖం పక్కకు తిప్పేసుకున్నాను.

పూజ్యులైన ఆ ముసలాయనకు వంగి నమస్కరిస్తూ ఉంటే, నా తల భారంగా నిమురుతూ... ..."దీర్ఘసుమంగళివై వెయ్యేళ్ళు వర్ధిల్లుతల్లీ!" అంటూ చిరునవ్వుతో దీవించారు.

ఆ రోజున వాళ్ళందరకూ భోజనాలు చాలా వేగిరంగానే తయారయాయ్. అందరూ పెళ్ళివారిలా బారులుతీరి కూర్చున్నారు. వడ్డన రెండు పిండివంటలతో చాలా హుషారుగా జరిగింది. అరగంటలో భోజనాలు అయిపోయాయ్.

తాంబూలాలు వేసుకొంటూ అందరూ తివాసీమీద ఆశీనులయారు. పిల్ల నచ్చిందని, దగ్గరలోనే ముహూర్తం నిశ్చయం చెయ్యమని ఆ ముసలాయన నాన్నతో చెప్పారు. ఆ సమయంలో వరకట్నంగురించి మా నాన్న కొద్దిగా జంకేరు.

కట్నాలూ, కానుకలూ పుచ్చుకొనేవారం కామని... తమకు మోడరన్ వ్యూస్ ఉన్నట్లు చెప్పేశారు. వారివి మహోన్నతమైన ఆశయాలని తొలిమాటలోనే తెలిసింది. "వరకట్నాలు విలయతాండవం చేస్తూన్న స్వార్థభూయిష్టమైన ఈ సమాజంలో అటువంటి నవభావాలుకల నరుగురు నవ

యువకులు ఉంటే మగజాతికే ఎంతో ప్రతిష్ఠ !!!" ఈ పీడిత ప్రజానీకానికి అటువంటి ఆదర్శహృదయులు ఎందరైనా కావా లనిపించింది.

ఎదురింట్లో ఉన్న ఆచారిగారి అమ్మాయిలు శకుంతలా... లీలా... సంధ్యాకి కట్నాలుపోసే తాహతులేక, పాపం! పాతికేళ్ళు వచ్చినా పెళ్ళిళ్ళు కాకుండానే ఉండి పోయారు. వారి జీవితాలు చూస్తే చాలా హృదయవిదా రకంగా ఉంటాయ్ —

ఒక టేక్సీ వచ్చింది.

స్టేషనుకు వెళ్ళేఅందుకు నాన్నగారిదగ్గర శెలవుతీసుకొని అందరూ అందులో కూర్చున్నారు. ఆయన లోపల కూర్చుంటూ తలెత్తి చిరునవ్వుతో చివరసారి నావైపు చూశారు. నా ఖర్మంకానీ ......ఎక్కడలేని సిగ్గూ ఆ క్షణంలోనే నన్ను ఆవహించాలా? చటుక్కున ముఖం దించేసుకున్నాను. ఆయన ఏమనుకుంటూరేమో నని మళ్ళా ముఖమెత్తి చూసేలోపున టేక్సీ చాలాదూరంవెళ్ళిపోయింది.

బరువెక్కిన హృదయాన్ని భారంగాపట్టుకొని నా గదిలోనికి వెళ్ళిపోయాను. వారం రోజులు గడిచాయ్—

ఇంట్లో పెళ్ళి ప్రయత్నాలు చాల హుషారుగా జరుగుతున్నాయ్. ఇంతట్లో మందపల్లినుండి శనేశ్వరుణ్ణి ఎలానో వదల్చుకొని తిరిగి వచ్చింది అమ్మ.

చక్కని సంబంధం వచ్చిందని త్వరగా చేసెయ్యాలని చెప్పేశారు నాన్న.

"దాని ముఖం దానికేం తెలుసునండీ! బొత్తిగా చిన్నపిల్ల......ఇప్పుడప్పుడే దానికి పెళ్ళెందుకండీ" అంది బుగ్గలు నొక్కుకుంటూ. ఆ మాటలువింటూంటే దగ్గరగా వెళ్ళి మరింత గట్టిగా బుగ్గలు నొక్కెయ్యాలనిపించింది.

ఆ మాటలు వింటూఉంటే నాకు ఒళ్లుమండదూ...
......??? నేను చిన్నపిల్లనట! ......నాకేం తెలీదట!!!
ఎందుకు తెలీదూ?

"ఆడపిల్లను ఇంట్లో ఉంచుకొంటే అందరూ ఆడిపొయ్యారూ...?" అన్నారు నాన్న. ఆయన మాటల్లో కుటుంబసంస్కారం ఉట్టిపడుతోంది.

"ముహూర్తం కూడా నిశ్చయం అయిపోయింతేమిటి?" అంది అమ్మ తన కొంపేదో మునిగిపోతూ ఉన్నట్లు.........తన తమ్ముడికి తప్పిపోయిందని మా అమ్మబాధ!

మరొక వారం రోజులు గడిచాయ్—

ఆరోజునే పెళ్ళి.

మేడకు రకరకాలైన ఎలక్ట్రిక్ బల్బుల తోరణాల శోభా, షవర్ బాత్ రేషన్లతోనూ ప్రతి అంగుళం మహా వైభవంగా కనబడుతోంది.

మిలటరీ బేండ్‌తో వీధి వీధంతా మారు మ్రోగు తూంది. చుట్టాలతోనూ, స్నేహితులతోనూ మా ఇల్లు ఘూర్ణానికి చాల రష్‌గా ఉంది. కొంపతీసి మా యిల్లు ఈనిందా అనిపించింది.

ఆ శుభ ముహూర్తాన్ని ఆయన చిరునవ్వుతో మంగళ సూత్రం కట్టేరు.

గోల్డు చెయిన్‌తో కూడిన ఖరీదైన ఒక వెస్టు ఎండ్ రిస్టువాచ్…… …చిన్న ఫిలుప్స్ రేడియో…… …రెండు వజ్రపుటుంగరాలూ, ఆయనకు పెళ్ళిపీటలమీద చదివించారు నాన్న.

పెళ్ళి మహావైభవంగా జరిగిపోయింది.

నా క్లాస్‌మేట్సు అందరూ ఆయన రూపురేఖలు ప్రశంసిస్తూ, మధ్య మధ్య వాళ్లు ముక్కిసిపోతూ…… …… నేనెంతో పెద్ద "ఛాన్సు" కొట్టేశా నన్నారు. వాళ్ళలా అంటూంటే పట్టరాని ఆనందంతో సగర్వంగా వాళ్ళ కళ్ళలోకి చూసేదాన్ని…… …అలా చూస్తూ ఉంటే నామీద ఎదురింట్లో ఉన్న శకుంతలా, పక్కింట్లో ఉన్న షాషా, జలసీ ఫీలయ్యారు.

పెళ్ళి అయిన తరువాత ఆయన నన్ను తనతో పాటు డెహరాడూన్ తీసుకొని వెళ్ళిపోతామన్నారు. నాన్న అంగీకరించక తప్పిందికాదు.

నేను తెలుగుగడ్డకి, కొన్నివందలమైళ్ళు దూరం వెళ్ళిపోతూఉంటే అమ్మా, నాన్నా నన్ను చూసి ఎంతగానో యేడ్చారు. నేను వాళ్ళనివిడచి చాలా దూరం వెళ్ళిపోతున్నానని, మళ్ళా తిరిగి రానేమోనని కాబోలు వాళ్ళ దిగులు... ......

అమ్మనూ, నాన్ననూ విడిచిపెట్టి ఇప్పటి వరకూ ఒక అంగుళం కూడా ఎక్కడికీ ప్రయాణం చెయ్యలేదు. అర్ధసెకెండు కూడా యెక్కడా, యేవ్వాళ్ళనూ ఉండలేదు. ఇదే తొలిసారి... ...! తొలిఅనుభవం— ..!!! ఆయనతో వెళ్ళక తప్పదు !!!

తల్లి దండ్రులకీ, స్వంత ఊరికీ, ప్రాణస్నేహితులకీ దూరమైపోతున్నాననే బాధతో నే ట్రైన్ ఎక్కాను. ఆయనతోపాటు ప్లాట్‌ఫారంలో దిగాను. నన్ను యే హిమవత్ శ్రేణిలోకో తీసికొనిపోడానికి... ...విజయభేరీలతో సైనికుణ్ణి ముందుకునడుపుతూ ఉన్నట్లు... ...పెద్దరొదచేస్తూ యక్స్‌ప్రెస్ వచ్చింది. బాధగా అమ్మా, నాన్నా వైపు చూశాను. ఏకైక పుత్రుడు వార్‌ఫీల్డులోకి వెళ్ళిపోతూ ఉన్నప్పుడు...వయోవృద్ధులైన తల్లి దండ్రులను కడసారి చూస్తూఉన్నట్లు చూసిన చూపులవి... ...అమ్మా నాన్నా నన్నొదలలేక వదిలారు.

గతరాత్రి తొలిసారిగా చవిచూసిన మధురఘట్టాన్ని జ్ఞాపకం చేసుకుంటూ... ...ఆ మధుర స్మృతులతో కొన్ని

క్షణాలపాటు లీనమైపోయాను. ఆయనతో వెళ్ళిపోటానికే నిర్ణయం చేశాను కాని మళ్ళా మా అమ్మ నన్ను పట్టుకొని వదలలేదు. మా ఇద్దర్నీ వేరుచేస్తూ, కెనడియన్ ఇంజన్ "ఇంక ఆలస్యం చెయ్యక త్వరగా మార్చింగ్ చెయ్య్" అన్నట్లు......దయాదాక్షిణ్యాలు లేని ఘోరమైన హోరు చేస్తూ గర్జించింది.

ఆయనతో వెళ్ళిపోవాలని ఇంత ఆత్రుత ఎందుకూ నాకు......? ఏంటో ధైర్యం !!! ఏంటో నా ఆత్రుత !!! ఆయన కూర్చున్న ఫస్టుక్లాస్ కంపార్టుమెంటుచూసి...... చటుక్కున ఐరన్ బారుపట్టుకొని ఫుట్ బోర్డు మీద కాలు వేసి......లోపలకు పోయి ఆయన పక్కన కూర్చొన్నాను.

ఇంతలో రైలు కదిలింది.

మానాన్న దానితోపాటే ప్లాట్ ఫారం మీద పరిగెడుతూ నాకు యేవేవో హితబోధలు చేస్తున్నారు...... వింటూనే ఉన్నాను...ఈయనగారు అతన్ని ప్రమాదం... ఉండిపో మని వారిస్తూనే ఉన్నారు. ఏంటో అతని పిచ్చి!!

ప్లాట్ ఫారం ఎలాగైతేనేం దాటిపోయింది. మా దృష్టిని వేరుచేస్తూ మాపెట్టె ముందుకు కదలి పోయింది. ఆక్షణంలో నామనస్సు చివుక్కుమంది. మాతృప్రేమకీ, పితృవాత్సల్యానికీ దూరమైపోతూ నేను రైలులో కొన్ని వందలమైళ్ళప్రయాణం చేసాను. మూడురోజులు ప్రయాణం

చేసి రైలు డెహరాడూన్ "కంటోన్" మెంట్లో ఆగి పోయింది.

ఆయ నొక పెద్ద లెఫ్టినెంట్ జనరల్ కావటం చేత హోదాకి తగ్గ క్వార్టర్సు యిచ్చారు. శిక్షక శిబిరాలలో ఆయన ఆఫీస్ ముచ్చటగా ఉంది. కంటోన్‌మెంటు చూట్టానికి చాలా అందంగా ఉంటుంది. చుట్టూ మిలటరీ ఆఫీసర్సు క్వాటర్సు ... ఇంటి చుట్టూ చక్కని గార్డెన్ ... చిత్ర విచిత్రమైన క్రోటన్సులూ, పూల మొక్కలూ వరుసగా ఒక క్రమపద్ధతిలో నాటి, చూపరుల కెంతో ఆశ్చర్యం కలిగిస్తూ వచ్చి పోయే ఆఫీసర్సుని చూసి "పెరేడ్" చేస్తూ ఉన్నట్లు నిలబడి ... సెల్యూట్ చేస్తూ ఉంటాయ్ !! బాల్కానీలో కూర్చుంటే ... ఎటుచూసినా కొండలూ... నదులూ...సరస్సులూ... కన్నుల పండుగ చేస్తూ గంటల తరబడి కూర్చోమంటాయ్.

వారాని కొకసారి ఆయన నన్ను "ముస్సోరీ" తీసు కొనివెళుతూ ఉండేవారు. కరుగుతూ ఉన్న హిమవత్ శ్రేణి చూస్తూ, శెలయేరుల్లోని నీళ్ళు తాగుతూ సరోవరాల వద్దన రోజుల తరబడి పసిపిల్లల్లా ఆడుకొనేవారం !! ఆయన పక్కను కూర్చుంటే రోజులు క్షణాల్లా గడిచిపోయేవి. మహా వైభవమైన ప్రకృతి దృశ్యాలు చూస్తూఉంటే మనస్సు పరవశంతో నిండిపోయేది.

తొలి స్నేహితుల్ని, చుట్టాల్ని విడిచిపెట్టి ఆయనతో వంటరిగా వెళ్ళిపోవటం నాకెంతో బాధనిపించింది. కాని నా వంటరిజీవితం నన్నేమాత్రం కృంగదియ్యలేదు. క్రొత్త స్నేహితులమధ్య క్రొత్తవాతావరణంలో ... నాజీవితమే ఒక క్రొత్త అనిపించింది...

ఆ ప్రశాంతవాతావరణం నన్నూ నా మనస్సునూ పితృవాత్సల్యం నుండి, మాతృప్రేమనుండి మైమరపించి ఆశలకూ, ఆదర్శాలకూ అంకురార్పణచేసి ... నా నూతన జీవితానికి ప్రారంభోత్సవం చేసింది. సమ్మర్ అంతా కాశ్మీర్ లోనే గడిపాం !!

శరత్ కాలపు పౌర్ణమి వెన్నెల్లో హిమవత్ శ్రేణి వెండికొండలా కనబడేది. సరోవర దృశ్యాలు చూస్తూ ఆ ప్రశాంతవాతావరణంలో ఏకాంతంగా ఒక రాతిశిల మీద కూర్చొని సరోవరకవి వర్డ్స్‌వర్తులా ఎన్ని మహాకావ్యాలైనా రాయొచ్చు ... రాయాలనిపిస్తుంది కూడా. భావతరంగాలు అక్కడే వెల్లువలై పారుతాయ్. తొలి కావ్యప్రవాహం అక్కడే ఉద్భవించింది. కళామయ జీవితానికి అక్కడే ప్రారంభోత్సవం చేశారు. జగత్ శిల్పి ప్రకృతికన్యను కాశ్మీర్ లోయల్లో ఉన్న గుల్మార్గ్ లోయల్లోనే సృష్టించి, అక్కడే శాశ్వత ప్రతిష్ఠ చేశాడు. దివ్యజీవనానికి అదే పుట్టినిల్లు ... ఆ ప్రకృతి సౌందర్యవతికి సాటి ... ఇంకీ ప్రపంచంలో మరొక సౌందర్యవతి లేదు.

ఫలపుష్పాలను ఆస్వాదించే అదృష్టవంతులు లేక—
ఫ్రూసీ, కాసీ, మట్టిలోనే మాయమైపోతాయ్. మహోన్నత
శిఖరాల మీదనుండి జలపాతాలు కొండ ఒరకల్లో పడు
తూంటే చూట్టానికి మహా వైభవంగా ఉంటుంది. నా
జీవితానికి ఇంక ఇది చాలనిపించింది.

ఒక్కసారి ఆ వాతావరణాన్ని కన్నుల పండుగతో
కళ్ళారాచూస్తే కళ్ళ కాలుష్యం తొలిగిపోతుంది! అందు
క్షేత్రనే ఆమహోజ్వల ప్రకృతిలో లీనమైపోతూ సంవత్సరాల
తత్వబడి తపోనిష్ఠలో తన్మయులై, కొందరు మహానుభావులు
ఎన్ని మహాకార్యాలైనా సాధిస్తారు.

ఆయన స్నేహితులు ఎంతో మంది మా యింటికి
వస్తూ పోతూ ఉండేవారు. స్నేహితు లందరిలోనూ రఘు
[illegible] ప్రాణస్నేహితులు. శెలవ్ రోజుల్లో ఆయన ఇంటి
దగ్గర యేదో ప్రోగ్రామ్ పెట్టించేవారు. ప్రతివినోదం ఒక
ప్రత్యేక వినోదం! అది జీవితంలో మరచిపోరాందిగా
మనస్సుల్లో హత్తుకుపోయేది.

రఘు కూడా శిక్షణకేంద్రంలో ఒక పెద్ద ఉన్నతో
ద్యోగి! ఒక్కొక్క రాత్రి అతనూ మాయింట్లోనే ఉండి
పోతూ ఉండేవారు.

సాయంకాలం నాలుగుగంట లైనతరువాత ఆయన
నన్ను షికార్ కి ఎక్కడెక్కడకో తీసుకొని వెళ్లేవారు. ఆఫీస్ లో
జరిగిన యెంత చిన్న సంఘటనన్నైనా ఇంటికి వచ్చిన వెంటనే

పూసగుచ్చినట్లు చెప్పేవారు. తరచుగా వారాని కొకసారి బోట్ షికార్‌కి వెళుతూ ఉండేవారం!!!......

ఇలా అయిదు సంవత్సరాలు ఎంతో ఆనందంగా గడిపాం...

ఒకరోజున ఆయనకు ప్రమోషన్ కాగితం వచ్చింది. ముచ్చటతో మురిసిపోతూ నాతో చెప్పారు. ఆయన విశాల భవిష్యత్ తల్చుకొంటూ మురిసిపోయాను.

ఆ రెండవరోజున అందరూ ఒక పెద్ద ప్రోగ్రామ్ ఏర్పాటు చేశారు. చిన్నచిన్న ఆఫీసర్ల దగ్గరనుండి పెద్దపెద్ద ఆఫీసర్ల వరకూ ఒకనాల్గువందలమంది ఆ విందుకు వచ్చారు. ఇంటిముందు గార్డెన్‌లో విందు ఏర్పాటు చేశారు. ఆ రోజున ఆయన ఆనందం ఇంతా అంతా అని చెప్పటానికి వీల్లేదు.

హాల్లో డాన్సు ఏర్పాటు చేశారు.

ఎవరో ప్రసిద్ధ నర్తకి ఆజ్మీర్ నుండి వచ్చింది. ఉత్తరాది స్త్రీ. రాచకుటుంబానికి చెందిన యువతి. చూట్టానికి మహా అందంగా ఉంది. నన్ను తీసుకెళ్ళి ఆమెకు పరిచయం చేశారు ... ఆమె యేదో పెద్ద విషవ్యాధితో బాధపడుతూ ఉన్నట్లు నాకు తోచింది. [illegible]

[illegible]

[illegible]

చేసింది. అందరిచేతా ప్రశంసలు అందుకొంటూ [illegible]

ఈయన ఒక సువర్ణపతకం నాచేత బహూకరింపజేశారు. విందు అయిపోయింది. ఎవరిమానాన్న వాళ్ళు వెళ్ళిపోయారు.

ఇలా ఒక నెల రోజులు గడిచాయ్—

విధాత వ్రాసిన సుఖభోగాలను అనుభవించేశాను. ఇక దుఃఖభూయిష్ఠమైన జీవితానికి అలవాటు పడిపోవాలి. నా మహోన్నత జీవితంలోని ఒక్కొక్క సంఘటనే, ముక్కలై కిందకు జారిపోతూ ఉన్న తొలిరోజు వచ్చింది.

ఆయన పాతస్నేహితు లందరూ తరచుగా మా ఇంటికి రావటం మానేశారు. ఇంతకు ముందు ... విధీ విరామం లేకుండా వచ్చే నా స్నేహితురాళ్ళు ఇప్పుడు ఒక్కరుకూడా రావడంలేదు.

ఆయన పూర్తిగా చెడిపోతున్నారని, ఎవరో నర్తకితో పరిచయం కలిపారనీ, ఆమెనే చట్టవివాహం చేసుకోటానికి నిశ్చయం చేసుకున్నారని ... తాగుడికి లోనై వ్యభిచరిస్తు న్నారని నా తలతిరిగేటట్లు ఎవరో చెప్పారు. ఇంకా భయం కరంగా కూడా చెప్పారు. ఒక్క నెలలోనే ఆయన ప్రవర్తన లో యిన్ని మార్పులు వచ్చినట్లు చెప్పారు. వాళ్లు చెప్పే మాటలు వింటూంటే, భయంతో, హడలిపోయేదాన్ని—నాసమక్షంలో ఎవరైనా అతని ప్రవర్తన గురించి అసభ్యంగా మాట్లాడితే నేను సహించలేకపోయేదాన్ని. చెవులు చిల్లులు పడేవి. ఆయన్ని నిందిస్తూ ఉంటే పట్టరాని కోపంతో కసరి పొమ్మనేదాన్ని—

బయట ప్రపంచంలో ఆయన ఎంత అవినీతిగా ప్రవర్తిస్తున్నారో మాత్రం నాకు తెలీదు. గృహజీవితంలో మాత్రం ఆయన వ్యక్తిగత ప్రవర్తనలో మచ్చుకైనా ఒక్క లోపం కనిపించేది కాదు. మునుపటిలాగే నన్ను ప్రేమగా చూస్తూ ఉండేవారు.

ఆయనకి కిట్టనివాళ్ళు చెప్పిన మాటలు విని ఆయణ్ణి నేనెన్నడూ నిందించలేదు. అనుమానాలతో కూడుకొన్న నా కుటిలస్వభావాన్ని గుర్తించి ఆయన ఎంతగా బాధ పడతారో!! అతని వ్యక్తిగత జీవితంలోని లోటుపాట్లను చూపించే ఆధారాలు నాదగ్గరలేవ్ ... చూసిన సాక్షులు కూడా నాకు తెలీదు. ఏ ఆధారాన్ని పట్టుకొని ఆయన మీద దండెత్తగలనూ? ఆయణ్ణి దుమ్మెత్తిపోసే అందుకు నే నెన్నడూ సాహసించలేదు. ఆయన నాపై చూపే నిష్కల్మషమైన ప్రేమానురాగాలే నన్ను పెడదారిలో నడిపించే అందుకు దోహద మియ్యలేదు. నిరాధారమైన ఏ సంఘటనలు పట్టుకొని ఆయనమీద దండెత్తగలనూ...?

ఆయన ఎన్ని పెడదారుల్లో నడిస్తే నాకేమీ...?? అలా అడగొచ్చా?? నే నొక పవిత్ర హిందూ గృహిణినై —ఆయన చరణదాసినై — నాజీవిత కర్తవ్యాన్ని నేను నిర్వర్తించుకోవాలి!!

గడచిన ఈ ఐదేళ్ళ జీవితంలోనూ ఆయన నా కేటు వంటి లోపాలు చెయ్యలేదు.

నే నొక క్షణం కనబడక పోతే . . .

ఒక్క రోజున జ్వరం కాస్తే . . .

ఒక్క చిన్న దెబ్బ తగిల్తే . . . . . .

ఆయన ఎంతగా తల్లడిల్లి పోయే వారో నాకు తెలుసు! సంసార స్వర్గంలో నేను అనుభవించిన ఆనందం, పొందిన సుఖం యే భారత స్త్రీ కూడా అనుభవించి ఉండదని నా అనుభవం !! నా స్వేచ్ఛకీ, నా ఆనందానికీ . . . నా అల వాట్లకీ ఆయన ఎన్నడూ నాకు అడ్డు చెప్పే వారు కాదు.

ప్రతిరోజూ ఆయన సాయంకాలం ఐదు గంటలకల్లా ఇంటికి వచ్చేస్తూ ఉండేవారు. ఎన్ని అర్జంటు పనులు ఉన్నా అవన్నీ చూసుకొని ఎంత టైమ్‌కైనా ఇంటికి వచ్చేస్తూ ఉండేవారు.

ఒక రోజు రాత్రి ఆయన ఇంటికి రాలేదు. చీకటి పడుతూ ఉన్నప్పుడు ఆఫీస్ బోయ్ వచ్చి, "అయ్యగారు రాత్రి ఇంటికి రారు" అని చెప్పి వెళ్ళిపోయాడు. ఇలా నాల్గు రాత్రుళ్లు గడిచాయ్. రోజురోజుకీ నా ఒంటరిజీవితాన్ని భరించలేకపోయేదాన్ని. ఆయన ఇంటికి రాకపోవటం చూసి నాకు చాలా భయమేసింది. ఒకరోజు ఉదయం ఉన్నట్లుండి ఎక్కడ నుండో ఊడిపడ్డారు. ఉదయం ఆరుగంటలకల్లా ఆయన నాగదిలో [illegible] ఆశ్చర్యంతోనూ సంతోషంతోనూ ఉక్కిరి బిక్కిరై [illegible] ఉండ

"రేణుకా . . . !" అంటూ చాలా ఆతృతగా పిలచారు. ఒక్క-గంతులో ఆయన దగ్గరకు వెళ్ళిపోయాను. "కొద్దిగా కాఫీ చేసి తీసుకురా . . . . చాలా నీరసంగా ఉంది . . ." అని చెప్పి బ్లాంకెట్ కప్పుకొని నిండా ముసుగు తన్ని పండుకొన్నారు.

ఒక ఐదు నిముషాల్లో కాఫీ తయారుచేసి, ఆయన గదిలోకి తీసుకువెళ్ళాను. తలెత్తి కొద్దిగా ముసుగు ప్రక్కకు తప్పించుకొని నావైపు ముఖంతిప్పి "అక్కడ పెట్టి వెళ్ళు" అని చెప్పి యథాప్రకారంగా పోయి పండుకొన్నారు.

ముఖం పైకెత్తినప్పుడు అతని కళ్ళలోకి చూస్తే నాకు చాలా భయమేసింది. కళ్లు బాగా వాచి ఎర్రగా ఉన్నాయ్. ముఖం చూస్తే కందగడ్డలా ఉంది. అతని ముఖం చూస్తే ఏదో జబ్బు స్థితిలో ఉన్నట్లు కనబడింది. శరీర మంతా వణకుతోంది.

మళ్ళాపదినిముషాలు పోయిన తరువాత అతని గదిలోకి వెళ్ళాను.

పెట్టిన కాఫీ పెట్టినట్లే ఉంది.

ఇంకా ఆయన అలా పండుకొనే ఉన్నారు.

నా మనస్సు సహించలేదు. ఆయన మంచం దగ్గరకు వెళ్ళి బ్లాంకెట్ తొలగించి నుదురుమీద చేతులు వేసి చూశాను. నుదురు నిప్పులా కాలుతోంది. బాగా జ్వరం వచ్చింది. "కాఫీ తాగండి . . . " అన్నాను; కాఫీ కప్పు

నోటికందిస్తూ. కొద్దిగా రెండుగుక్కలు తాగి కళ్ళుమూసు కొని పక్కకు వత్తిగిలి పండుకొన్నారు.

ఆయన స్థితి చూస్తూ ఉంటే నాకు దుఃఖం ముంచు కొచ్చింది.

గడచిన ఐదేళ్ల జీవితంలోనూ జ్వరంచేత మంచ మెక్కి ఒక్క రోజుకూడా పండుకోలేదు. అంత ఆరోగ్యమైన శరీరతత్వం అతంది.

మరొకసారి అతని బెడ్ వైపు చూశాను.

నాకళ్ళల్లో నీళ్ళు తిరిగాయ్.

సాయంకాలం నాల్గగంటలవేవరకూ అలా కూర్చొన్నాను.

"రేణుకా! ఎంతసేపు యిలా కూర్చుంటావ్ . . . వెళ్ళు, వెళ్ళి భోజనం చెయ్యి" అంటూ ఒకసారి నాతల భారంగా నిమిరి, బరువుగా పక్కకు వత్తిగిలిపండుకొన్నారు.

"రఘుకి కబురు పంపిస్తా"నన్నాను.

వద్దన్నారు.

"రెజిమెంట్ డాక్టర్ కి హెడ్ క్వార్టర్సుకి ఫోన్ చేస్తా"నన్నాను.

ఆ పని మాత్రం చెయ్యొద్దన్నారు.

"పోనీ ప్రయివేట్ డాక్టర్ని పిలిపిస్తా నన్నాను.

అవసరంలే దన్నారు.

ఇలా కొన్ని రోజులు దొర్లిపోయాయ్. రాత్రి సమయాన్ని ఆయన బాధగా మూల్గేవారు. నిద్ర పట్టేదికాదు. ఒక్కొక్కప్పుడు ఆయన యేడ్చేరేమో అనుకుంటాను.

నాల్గురోజులు గడిచాయి.

రఘుకి కబురు పంపించాను. అతను వెంటనే వచ్చారు. ఇద్దరూ చాలాసేపు యేమేమో మాట్లాడుకొన్నారు. ఆయన డ్రగ్ స్టోర్సు నుండి మందులు తెప్పించుకొని తాగేవారు.

అతని "కంప్లైంట్" ఏమిటో తెలిసిందికాదు. రోజులు గడుస్తూఉన్నా, మందులు తాగుతూఉన్నా జబ్బు తాలూకు ఉద్రృతం ఏమాత్రం తగ్గినట్లు కనబడలేదు. పైగా ఎక్కువవుతోంది. బాధ భరించలేకపోయేవారు.

రఘు పట్టు పట్టి ఒకరోజున హెడ్ క్వార్టర్సుకి ఫోన్ చేశారు.

మరొక అరగంటకల్లా "అంబులెన్సు" వేన్ వచ్చింది. అందులో నుండి ఒక మిలటరీ డాక్టర్, ఇద్దరు నర్సులూ, ఒకరిద్దరు పరివారం బయటకు దిగారు. రఘు వాళ్ళను లోపలకు తీసుకువచ్చారు. ఒక నర్సు వచ్చేరావటంతోనే టెంపరేచర్ చూసింది. 103° డిగ్రీలజ్వరం ఉందని ఇంగ్లీష్‌లో చెప్పింది.

నన్ను బయటకు వెళ్ళిపోమన్నారు. ఒక ఐదు నిమిషాలుసేపు డాక్టర్‌తో ఏమేమో మాట్లాడుకొన్నారు. డాక్టర్ ఒక యింజక్షను ఇచ్చారు.

రాత్రి కేమీ డైట్ ఇయ్యవద్దని చెప్పారు.

"బోయ్‌ని పంపించండి . . . మం దిస్తారు" అని చెప్పి ఏదో రాసి ఆ ప్రిస్క్రిప్షను కాగితాన్ని రఘు చేతిలో పెట్టారు. ఒక ఐదు నిమిషాలవరకూ ఆయనతో యేదో మాట్లాడి శలవ్ తీసుకొని వెళ్లిపోయారు. మరొక రెండు రోజులు గడిచాయ్. జబ్బు అంత్యస్థితిని అందుకొంటూ ఉన్నకొద్దీ ఆయనలో స్పృహ పోతోంది. కాళ్ళూ చేతులూ కంపించేవి.

చాలా ప్రమాదమని హాస్పిటల్‌లో ఇక పేషెంటుగా ఉంచాలని రఘు చెప్పారు.

భయంతో నా నవనాళ్ళూ కంపించిపోయాయి. నలుగురు నర్సులూ, ముగ్గురు డాక్టర్లూ వచ్చి ఆయణ్ణి స్ట్రెచ్చర్‌తో తీసుకువెళ్ళి రెడ్ క్రాస్ వేన్‌లో ఎక్కించుకొని రక్షక శిబిరాలకు తీసుకొని పోయారు.

మరొక నాల్గురోజులు గడిచాయి——

వ్యాధి జీర్ణించుకు పోయిందని, కోలుకోవటం చాలా దుర్లభమని చెప్పారు డాక్టర్.

దుఃఖం పెల్లుబికింది.

ఆరోజు రాత్రల్లా ఆయన బెడ్‌మీద మరణబాధ పడ్డారు. ఆయనకి స్పెషల్‌గా ఒక రూమ్ యిచ్చారు. ఇద్దరు నర్సులు ఆయనకి సపర్యలుచేస్తూ, ఆరోజు రాత్రల్లా ఆయన గదిలో ఉన్నారు.

తెల్లవారిన తర్వాత ఆయన మాట్లాడలేదు. ఎంతో ప్రయత్నించారు; కానీ మాట్లాడలేకపోయారు. ఆ క్షణంలో నాకెంతో గాభరా కలిగింది.

ఆరోజు రాత్రి గడిస్తే ఆయన బ్రతికిపోతా రన్నారు అందరూ . . . 12 గంటల ప్రాంతంలో ఆయన కళ్ళు తెరచి చివరిసారిగా నావైపుచూశారు. అంతే . . . . .!!! మళ్ళా కళ్ళు తెరవలేదు. బాగానిశిరాత్రి అయిన తరువాత ఆయన ప్రాణాలు అనంతాకాశంలో అంతర్ధానమయ్యాయ్—

చివరి కాయన యే జబ్బుతో చనిపోయాడో నా కే డాక్టరూ చెప్పలేదు. మృత్యుముఖంలో ఉన్నప్పుడు కూడా ఆయన యదార్థాన్ని నాతో చెప్పలేదు. ఆయన మరణానంతరం కూడా ఆ జబ్బుని ఎవ్వరికీ, చెప్పవద్దని కాబోలు అతని ఉద్దేశం . . . . . !!! నా దగ్గర అసత్యాన్ని చెప్పి వ్యాధిని మరుగుపరచారు.

అప్పట్లో ఆయన యేదో పెద్ద విషవ్యాధితోనే మరణించారని మాత్రం నేను తీవ్రంగా ఊహించుకోగలిగాను.

అతని మరణానంతరం ఇంక నే నా కంప్లైంట్ తెలుసుకోవటానిక్కూడా నేనెన్నడూ ప్రయత్నించ లేదు—

అది నేటికీ డాక్టర్లలో నిగూఢ రహస్యంగానే నిల్చిపోయింది . . . . . నాకు తెలీకుండానే ఉండిపోయింది.

కనుచూపుమేర దూరంగా కనబడే ఆ పర్వత లోయల్లో ప్రవహిస్తూ ఉన్న సెలయేరులవైపుచూస్తూ . . . నాదుఃఖాన్ని నాలో నేనే దిగమ్రింగుకొంటాను.

కానీ నా కావలసిన ఉపశాంతిని మాత్రం ఇప్పుడు నా కా లోయలు . . . . . ప్రసాదించలేవ్—

# కార్మికుడు

వినీలాకాశంలో కోట్లకొలదీ నక్షత్రాలు ప్రకాశిస్తు న్నాయ్. భూతలమంతా యింకా గాఢాంధకారంలో మునిగిపోయే ఉంది. మబ్బుల చాటునుండి జబ్బువానిలా కాంతివిహీనమైన ముఖంతో బాహ్యప్రపంచాన్ని చూసి జాలితో కృంగిపోతున్నాడు చందమామ – పొగమంచు

తెగలేదు —

తెలుపు తెరలు విడలేదు —

ఖార్ఖానా కొన్ని వేల గొంతుకలతో నలుమూలలా అలుముకొన్న కార్మిక ప్రపంచాన్ని గొంతెత్తి పిలుస్తూ బాధగా బావురుమంది మూడుసార్లు... !!!

ఆ పిలుపు నందుకొన్నట్లు చటుక్కున లేచి కూర్చొన్నాడు... అప్పుడే తన బ్రతుక్కి తెల్లవారిపోయిందని చెప్పి బాధతో కృంగిపోయాడు. కళ్ళు యిప్పిచూస్తే, ఇంకా నిద్రపోతూన్న వందలాది రోగులు ... కుర్చీల్లో కునుకుపాట్లు పడుతూన్న నర్సులు —

తనున్నది హాస్పటల్ —

తను చికిత్స పొందుతున్నాననే విషయాన్నే మరచి పోయాడు.

యేదో విషతగ్గు ... గొంతుక నులిమేస్తోంది ...

చలితో కంపిస్తోంది శరీరం .... జ్వర తీవ్రతతో కనుగుడ్లు కొలిమిలో కరిగే లోహాపు నీరులా మండుతున్నాయ్ —

లేచేఅందుకు ప్రయత్నించాడు —

వెన్నెముక ఖరేల్‌మంది...

విరిగిపోయినా బాగుండు ననిపించింది.

కీళ్ళనొప్పి... భరించ లేదు తను – అవయవాలన్నీ తన అదుపులో లేవ్ – ఉమ్మడిగా కట్టి ఒకచోట కూర్చోపెట్టే అందుకు వాటి హక్కుల నన్నీ చెలాయించుకొంటూ బ్రహ్మాండమైన సమ్మె చేస్తూన్నట్లు కనుపిస్తున్నాయ్. నరాల్లో యేదో అంతర్యుద్ధం జరుగుతోంది ...

తనకు సరియైన వైద్యచికిత్స అవసరమని ఘోనాడో పెట్టుకొన్న అప్లికేషన్ యీనాటికి మంజూరైంది! ఏం ప్రయోజనం ... ? తరుణం మించిపోయింది — వ్యాధితాలూకు ఉధృతం నరనరాన్నీ ప్రాకేసింది — "అమ్మా...!" అంటూ బాధగా మూల్గిందా కంఠం ... అమ్మ ఎక్కడుంది...? అమ్మలేదు — అమ్మ ఏ లోకంలో ఉందో... ? యేనిశీధి మధ్య నిద్రపోతోందో ?? ఆ పిలుపు బల్లెంపోటైవెళ్ళి యేలోకంలో ఉన్నా ఆ మాతృమూర్తికి గుండెల్లో చప్పున తగుల్తుంది —

"కష్టాలకోసమే నన్నీ ప్రపంచంలో కన్నావా తల్లీ!"

"త్వరగా నన్నూ నీ చెంతకి చేర్చుకోలేవా అమ్మా!"

బాధలతో ... జబ్బులతో ... జాడ్యాలతో
మృత్యువుకోసం అనుక్షణం తపిస్తోం దా కంఠం ...

కష్టాల్లోనూ, సుఖాల్లోనూ కళ్ళనీళ్ళుతుడిచే మాతృ
ప్రేమ యీ మధ్యనే తనకి కరువైపోయింది. అమ్మని తల్చు
కుంటే గుండె బ్రద్దలైపోయింది ——
ఏదో తనకు మేలు చెయ్యాలని, సుఖపెట్టాలని ప్రవాసంలో
తన వంటరి జీవితంలోని దుర్భర బాధలు చూళ్ళేక యింత
దూరం వచ్చింది. పాడుజబ్బు పట్టుకొంది –

వచ్చిన జబ్బు మరల్లేదు –

పట్టిన జ్వరం వదల్లేదు –

నిరుడీ రోజుల్లోనే ఈ భిలాయ్ గడ్డికి తన ప్రాణాలు
అర్పించేసి వెళ్ళిపోయింది అమ్మ ! –
విషపూరితమైన పొగ ——
వచ్చిపోయే లారీలకు ఆకాశపు టంచుల్ని అందుకొనేధూళి –
కృషిలో తన గుండెల్లో ప్రాణవాయువు నిల్చుకొనేటందుకు
అవకాశం లేదు.

ధూళినీ ... దుమ్మునీ ...... బొగ్గునీ ... పొగనీ
ఒకప్పుడు ఓర్పుతో గుండె భరించింది కాబట్టే తనగుండెల్లో
ఇప్పుడు ఈ గాయాలు బయల్దేరాయ్ – ఏదో విషవ్యాధి
అంకురించింది. అహోరాత్రాలు ఆరోగ్యాన్ని చూడకుండా
శ్రమించాడు ... ఇప్పుడు ఆరోగ్యం ఎలా వస్తుందీ ... !!

ఊపిరి అందరు — ఉశ్వాస నిశ్వాసాలు వెళ్ళే నాశికా కవాటాలమధ్య యేదో ఇనుపరజను అడ్డు తగుల్తూన్నట్లు ఫీలౌతూంటాడు. తన శ్వాస అందనప్పుడల్లా కిటికీవైపు పిచ్చిగా పరుగెత్తి, ఆకాశాన్నిఅందుకొనే పొగగొట్టాలవైపు చూస్తే తన ఆనందానికి అవధు లుండవ్ — !

ఆ మహోన్నత నిర్మాణం తన గుండెల్ని గుల్ల చేసిందని చింతించడు...

తన శ్వాస ఆగిపోయినా పర్వాలేదు—

తనకీ జన్మోద్దు—

తనకీ విషప్లావిత జీవితం అఖ్ఖర్లేను—

తను నిర్మించిన చిమ్నీ ఎప్పటికీ శ్వాస విడుస్తూ... పొగలు కక్కుతూంటే చాలని చెప్పి తృప్తి పడతాడు...

చేతులు మొరటు దేరి పోయాయ్—

శరీరంలోని రక్తమాంసాలు శిథిలమై పోయాయ్. అస్తిపంజరంలో అల్లాడే కొన ఊపిరి, ఎముకల గూడులోని దుర్గంధాన్ని భరించలేక అనంతాకాశంలోకి వెళ్ళిపోవాలని ప్రతిక్షణం ప్రయత్నిస్తోంది.

తను చేసిన నిర్విరామకృషి, తనగుండెల్లో ప్రవహించే శక్తివంతమైన ప్రతి రక్తకణాన్నీ మలినపరచి, విషబిందువులుగా మార్చేసింది—

తన తనువు ఎంతోకాలం ఈప్రపంచం మీద నిలవదని యెక్సరే తీసిన ప్రతి డాక్టరుకీ తెలుసు ! !

కానీ చెప్పరు...

తన్నింకా యేదో ఉద్ధరిస్తారట...!!

తను చచ్చిన తరువాత తన సమాధి మీద కృత్రిమ గుండెలతో రసాయనిక శస్త్రచికిత్స జరుపుతారట!

ఎందుకూ??

*　　*　　*

గుండెల్లో గాయాలు పెట్టుకొని ఆమెను సుఖపెట్టలేదు—"బావా!... సంక్రాంతి పండక్కి తప్పక రావాలి..." అని చెప్పి విశాఖనుండి పదిరోజులు ముందుగానే ఉత్తరం రాసింది పిచ్చిపిల్ల—వెళితే తన గుండెల్లో గాయాలు ఆమెకు చూపించకుండా ఉండలేదు. వివాహం చేసుకొని ఆమె వెయ్యేళ్ళ బ్రతుకూ విచ్ఛిన్నం చెయ్యలేదు. వెళితే పెళ్ళి నిశ్చయం చెయ్యాలి!... లేకపోతే ఊరుకోదు మామయ్య—బ్రతకనివ్వదు అత్తయ్య—

ఈ నిర్మాణాన్ని పూర్తిచేసి ... ఆమె జీవితాన్ని మంగళం పాడిస్తానని ప్రమాణం చేశాడు — అనూరాధని పెళ్ళి ఆడతాడనే దీర్ఘవిశ్వాసంతో మూడేళ్లనుండీ ఆమెను అవివాహితగా ఇంట్లో ఉంచేశారు. ఈ నవభారత నిర్మాణం పూర్తి ఐ పోయింది. ఆ మహాతరుణం కోసం వైవాహిక బంధాల కోసం అందరూ ఆశగా ఎదురు చూస్తున్నారు ...

మామయ్యకు ఒక్కగాని ఒక్కబిడ్డ ...

అనూరాధే వాళ్ళ సర్వస్వం—

తనగుండెల్లో విషజీవుల్ని నింపుకొని ఆమెను సుఖ పెట్టటం సర్వాకళ్ల...ఆమెను కట్టుకొని 'హరీ' మంటే... ఆమె జీవితంలో వెలియని తుపాకి తప్ప. ఇంకేమీ లేదు—

మూర్ఖపు మనుషులు...

తన బాధలు వాళ్ళకు తెలీవ్...

పెళ్ళి ఆడలేదని బాధపడతారు—

తనైనా త్వరపడి ఆమె జీవితవలయం నుండి తొలగి పోతే...మరెవరి నైనా పెళ్ళాడి హాయిగా సుఖిస్తుంది! తన్నీ నరకంలోకి ఈడ్వటం ఇష్టంలేదు.

సంక్రాంతికి ఉత్తరం రాసింది—

తను నేటికీ సమాధానం రాయలేదు—

రాయాలని లక్షసార్లు అనుకొన్నాడు—

తనకి వ్యవధేదీ రాసేటందుకూ ?

—వస్తానని చెప్పి పిచ్చిగా వచ్చీపోయే టాక్సీలవైపు ఎదురు చూస్తుంది ... రాలేదని చెప్పి ఎంతగా బాధ పడుతుందో!...

తనేదో బహుమతి కొన్నాడు పంపించాలని.......

పేకింగ్ చేశాడు—

పోస్టేజ్ అంటించాడు—

అది పోస్టుబాక్సులో పడే అవకాశం లేదేమో అని చెప్పి పరితపిస్తున్నాడు...

సిస్టర్ తులసీభాయ్‌కి డ్యూటీ - ఆఫ్ ఐ పోయింది కాబోలు—ఇంటికి వెళ్ళిపోవాలని డ్రస్‌విడిచి చీర కట్టుకొంది.

పోస్టాఫీస్ వైపే వెళుతుంది ఆమె...

అనుకోకుండానే "సిస్టర్" అని పిల్చేశాడు—

ఆ పిలుపు అందుకొన్నట్లు చటుక్కున వెనుదిరిగి చూసింది.

ఆభరణాలు లేకపోయినా ఆమె ఎంతో అందంగానూ, ఆకర్షణీయంగానూ ఉంది. అందమైన స్త్రీకి ఆభరణా లేమీ అవసరం లేదని ఆమె ముఖం నిరూపిస్తోంది. ముఖాని కేటు వంటి ఆకర్షణీయ వస్తువులూ పూసుకో లేదు. తెల్లని చీరతో కడిగిన ముత్యంలా కనిపిస్తోంది—ఎందుకూ...? అన్నట్లు చిరు నవ్వు నవ్వుతూ బెడ్ దగ్గరకు వచ్చి నిల్చొంది—

పోస్టు చెయ్యమని చెప్తే ఏమనుకొంటుందో అని చెప్పి సంశయించి పెదవి కదిపి ఊరుకున్నాడు. సంక్రాంతికి ఇంక మూడురోజులుమాత్రమే వ్యవధి ఉంది.

నర్సు తన ఆతృతా... ఆరాటం చూసి విలాసంవైపు చూస్తూ అదోకలా నవ్వింది ఆమె యేదో గ్రహించేసినట్లు సిగ్గుతో క్రుంగిపోయాడు — "అంత గాభరా పడతారేం...? దీన్ని పోస్టు చెయ్యాలా?" చిరునవ్వుతో పార్సిల్‌ని ఎడం చేత్తో అందుకొంటూ అడిగింది.

పేమెంట్సు బాధా బరువులు బాగా జీర్ణం చేసుకొన్న గుండె కాబోలు!!! ఆమె నిస్వార్థసేవ ఆస్పత్రిలోని ప్రతి బెడ్ పైనీ నిత్యం కాంతిపుంజములై వెల్గుతాయ్!—

తను చనిపోయినా పర్వాలేదు...

తన స్వహస్తాలతో అతికిన ప్రతి నిర్మాణం యీ భిలాయ్ గడ్డపై ఆచంద్రార్కం నిల్చిపోవాలి!!! ఒక యువక కార్మికుని పేరుప్రతిష్ఠలు సువర్ణాక్షరాలై, ప్రోజెక్టు ప్రాంగణాలమధ్య నిల్చిపోవాలి!!!

ఆ మహాద్భుత నిర్మాణంలోని ప్రతి అంశంలోనూ, తనొక ఆయువుపట్టు అనిచెప్పి గర్వపడతాడు. ప్రపంచమంతా నిబీడ నిశీథిమధ్య నిద్రపోతోంది—ఆ అంధకారంలో అడుగడుగునా ప్రతిఫలించే దీపకాంతులే కార్మికుల కార్యదీక్షకూ...నిరంతర కృషికీ ... దేశభక్తికీ కాంతిపుంజములై వెల్గుతున్నాయ్...

పన్నెండు కావస్తోంది—

కార్మిక సోదరులకు నిద్రాహారాలు అవసరంలేదు కాబోలు! — కనీస జీవితావసరాలు కూడా కాంక్షించినట్లే కనబడదు!

వారు చేసే నిరంతర కృషి పొట్టకోసం కాదు. ప్రగతి కోసం...దేశ సౌభాగ్యం కోసం...దాని ఫలితమే నేటి ప్రారంభోత్సవానికి మూలకారణం!!

రంగురంగుల విద్యుత్ దీపాలతోనూ ... పువ్వులతోనూ...కొమ్మలతోనూ...పిచ్చిగా ఒత్తుగా ఆకాశపు టెత్తున అలంకరించుకొని దేశనాయకుల్నీ, శాంతి దూతల్నీ ఆహ్వానిస్తోంది. ఐదు సంవత్సరాల క్రితం ఛూసిన అడవి

లాంటి ఆ నిర్జన భూస్థలి, నిర్భాగ్యులకూ, నిరుద్యోగులకూ నిలవ నీడ లిచ్చి, ఆ మహాకట్టడం నేటికీ అదృష్టానికి నోచుకోంది.

ప్లాంట్‌లో అడుగడుగునా ఏమేవో బోర్డులు తగిలించారు. పారిశ్రామిక రంగంలో ప్రథమ శ్రేణిని అందుకొన్న ఈ ఖార్ఖానాకి ప్రారంభోత్సవం అంటే మాట్లా...???

ప్రభుత్వానికి ప్రథమ నిర్వహణ !

కోశాగారానికి క్రొత్త బడ్జెట్ !!

పారిశ్రామిక రంగంలో తొలి మైలురాయ్ !!!

ఈ మహోతరుణం కోసం లక్షలాది ప్రజ, వందలాది దేశాలు వళ్లు అంతా కళ్ళు చేసుకొని చూస్తున్నారు.

—చేసినా తరగని పని . . .

కష్టపడినా కళ్ళ నీళ్ళు తుడవలేని ఇంజనీర్లు . . . నైతిక విలువల్ని అర్థం చేసుకోలేని, అధికార్ల చేతుల్లో యంత్రాల్లా . . . చక్రాల్లా . . . టర్బన్లులా తిరిగే మానవ జీవితాలు . . .

నిర్మాణ నిర్వహణలో మృత్యుముఖంలో ముక్క-చెక్కలై పోయిన అనాథకార్మికుల ఆర్తఘోష—ఆలుబిడ్డల పొడికన్నీళ్ళు . . . ఇంకా తన చెవులలో వినిపిస్తూనే ఉన్నాయ్ . . . తన కళ్ళల్లో కనిపిస్తూనే ఉన్నాయ్—

ఇనుపరాళ్ళనూ . . . ఉక్కు-బెడ్డలనూ తన క్రొత్త గుండెల్లో పోసుకొని కరిగించీ . . . మరిగించుకొనేటందుకు

చాలక ... రాక్షశిలా ఇంకా ఎందుకో పొగలు కక్కు-తూంది ...

* * *

"స్టీల్ ప్రోజక్టు మహోద్భుత నిర్మాణంలో నువ్వు ఒక భాగస్వామి వని చెప్తే గర్వపడ్డాను! ... నీమనస్సు కూడా స్టీల్‌గా మారిపోతుందని అనుకో లేక పోయాను, బావా ... !!!" బావురుమంటూ ఉత్తరం రాసింది పిచ్చి పిల్ల అనూ—"

నా గుండెల్లో గాయాలు ఆమెకేం తెలుసూ... ?

నిశీధిలో కిటికీలోనుండి కనుచూపుమేర కనబడే ప్రోజక్టుదీపాల వెలుగునీడల వైపు చూస్తూ ... నా దుఃఖాన్నీ, నాబాధల్నీ, నాలోనేనే దిగ్రమింగుకొంటూ ఆశాజ్యోతుల్లా కనబడే హాస్పటల్ దీపాలవైపు చూస్తాను—

—ఆ వెలుగు నీడల్లో మనశ్శాంతిని యేనాడైనా వెతుకో-గలనేమోనని...

(అశువు లర్పించిన కార్మిక సోదరులకు అంకితం)

—రచయిత

2—2—'59.

భిలాయ్ తెనుగు వాణిలో ప్రచురింపబడి

ప్రథమ బహుమతి నొందిన

ఉత్తమ కథానిక.

# ప్రసిద్ధ రచయిత మరణించాడు!!!

[" అబ్బా! ఏంటీ దారుణవార్త!!"—

"కరుణాకరుడు ఇంక మనకు కనబడడా???"

"ఇంక అతని ఉత్తమ రచనలు చదివి ఆనందించే యోగం లేదు కాబోలు! అతని కావ్యప్రవాహానికి నేటితోనే ఆనకట్టు పడిపోయింది!!!"

ఏ పత్రికలో చూసినా...ఎవరి నోటంటవిన్నా ఇదేమాట! ఆంధ్ర ప్రదేశ్ అంతా విచారసముద్రంలో మునిగిపోయి ఉంది. తన ఉదాత్త రచనలతో ఆంధ్రవాణికి మెరుగులు దిద్దాడు. ఎన్ని జన్మలకైనా అతని కలానికి మరణంలేదని ఊహించిన తన కలలన్నీ కల్లలుగానే మిగిలిపోయాయ్. ఆమె హృదయం తీరని శోకంతో తరుక్కుపోతోంది.

అతని ప్రసన్నరచనలు తుషార బిందువులై ఆంధ్రదేశమంతటా నేటి వరకూ పూలవర్షమై కురిశాయ్ — మహాకవి మరణించాడు!! ఇంక అతని రచనలు చూద్దామన్నా కనబడవ్......"]

ఆదోక కూలిపోతూన్న పెంకుటిల్లు!!! కనీ కనబడని మసిబారిన లాంతరు వెల్గుతో ... నులక మంచానికి మధ్యగా చైతన్య రహితమైన కరుణాకరుని విగ్రహం!!...నిట్టూర్పులతో సగం మధ్యలో ఆగి స్వేద తీర్చుకొంటూన్న అతని కలం...కొన్ని క్షణాలక్రిందటే ఆగిపోయిన అతనిగుండెలు... అలసట తీర్చుకొంటూన్న అతని శరీరం......!!! అబ్బా!! ఆ విషాద దృశ్యాన్ని ఇంక చూళ్ళేక పోయాను—

హృదయం పగిలేటట్లు విలపించి స్పృహతప్పి అతని ప్రక్కనే కుప్పవలె కూలిపోయిన అతని శ్రీమతి......ఆకలి మంటలతో తల్లివళ్ళో రోదిస్తూన్న పసిపాప!!

ఆమెకు స్పృహ వచ్చింది కాబోలు—తలెత్తి పిచ్చి దానివలె రెప్పవాల్చకుండా ఆ అసంపూర్ణ కథానికవైపు కన్నెత్తి చూసింది—

ఆ కథానిక రాస్తూనే తన ప్రాణనాథుడు అహోరాత్రాలు నిద్రాహారాలు మరచాడు కొన్నివారాలనుండీ తన భర్త ఆ కథానికను, ఎత్తిన కలం దించకుండా రాస్తున్నాడు. చివరకి ఆ కథే తన జీవితంలో తుఫాన్ రగిల్చి పెనుగాలై తన జీవితేశ్వరుణ్ణి ఎత్తుకుపోయింది. ఆమె కళ్ళ కొలకుల్లోనుండి ముత్యాల కోవల్లా రాలే కన్నీళ్లు ఆ కాగితాల్ని తడిపివేస్తున్నాయ్. దృష్టి భారంగా క్రిందికి నిల్పి పైటచెంగుతో కన్నీళ్ళు వత్తుకొంది వేదవతీదేవి ...

"దేవీ ... ఛా! ఏంటా కన్నీళ్లు ... ఈ కథానిక నేటితోనే పూర్తి ఐపోతుంది ... రేపటినుండీ నిశ్చింతగా నిద్రపోతాను ... !" అని నిన్నరాత్రే కరుణాకరుడు అన్న మాటలు ఇప్పుడు ఆమె హృదయంలో అగ్నిపర్వతాల్ని బ్రద్దలు చేస్తున్నాయ్.

ఆహా !! కరుణాకరుడు ఇప్పు డెంత నిశ్చింతగా నిద్రపోతున్నాడూ !! కష్టసుఖాలనూ... ఐహిక బంధాలనూ పూర్తిగా విస్మరింపజేసే సుఖనిద్ర అది — జీవరాసికి అది

అంత్యమనిద్రే కావచ్చు ... కానీ కరుణాకరునికిమాత్రం అదొక సుఖనిద్ర ...

పాపం !! దురదృష్టవంతుడు !!! ఆ కథ ముగింపుతోనే తన తనువుకూడా ముగించుకొన్నాడు. ఆ కథ విషాద ఛాయల్లో హృదయ విదారకమైన దృశ్యాలమధ్య సమాప్తం చేస్తూ తన్మయత్వం పొందేడు ... మళ్ళా తెలివితెచ్చుకొని ఈ బాహ్యప్రపంచంలోకి రాలేకపోయాడు. ఆ తన్మయత్వం లోనే తన ప్రాణాలు బాహ్యశరీరాన్ని వీడి అమరభోగాన్ని అనుభవించేందుకు యే ఆనందలోకానికో అదృశ్యమై పోయాయ్ ! —

ఆ విషాదదృశ్యం చూస్తూ ... ఆమె గుండెలు ఒక్క క్షణం ఆగి మళ్ళా ప్రతిధ్వనించడం మొదలుపెట్టాయ్.

"అయ్యో ! పరమేశ్వరా !! కను విప్పు పాటులో ఆయన కెందుకీ ఘోరమరణాన్ని సృష్టించావ్ నాయనా!! ఆయన నీకే అన్యాయాన్ని తలపెట్టారు ప్రభూ ! మా ఆలుబిడ్డల హృదయఘోష యింకా నీ కర్ణపుటాలను కలచి వేయలేదా తండ్రీ !! జీవితంలో పావు భాగాన్ని పూర్తి చెయ్యకుండానే ఆయనకీ ఘోరమరణాన్ని రాసిపెట్టావా నాయనా !!" ఆమె హృదయఘోషకి యే ప్రాణీకూడా చలించకుండా ఉండదు —

కరుణాకరుడు ఎర్రగా పొడవుగా... పక్కపలాచాగా ఉంటాడు. సన్నని ముక్కు — నల్లని కళ్ళద్దాలు... సంస్కారం

లేక పిచ్చిగా చుట్టుకు పోయిన క్రాప్... అశ్రద్ధవల్ల పెరిగి పోయిన గడ్డం ... అతను చూట్టానికెంత పిచ్చివాళ్ళా ఉంటాడో అతను రాసే రచనలు చదువుతే పాఠకులు అంత కన్న రెండింతలు పిచ్చెత్తిపోతారు. అతని సుదీర్ఘమైన చూపుల్లో నుండి వెలువడే తీయనిభావం ప్రజల్ని సంస్కారులుగా ... చైతన్యవంతులుగా చేస్తాయ్ ... తన ఉత్కృష్టరచనలతో పాఠకలోకాన్ని ప్రతిక్షణం మైమరపిస్తాడు ...

నెలకూ వాడు పదికథలు రాస్తాడు !! పది పత్రికలకు పంపిస్తాడు! పది ఐదులు యాభైరూపాయిలు పారితోషికాలు సంపాదిస్తాడు! పారితోషికాలే వాడి జీవితాధారం !!—ఐనప్పటికీ వాడి కళ్ళల్లో నా కేనాడూ అసంతృప్తిచిహ్నాలు ఉన్నట్లు కనబడలేదు. ఎప్పుడు చూసినా ఆ ఆలుమగలు అమరభోగాల్ని అనుభవిస్తూనే ఉంటారు. పైగా తనింటికి స్నేహితుల్ని ఆహ్వానిస్తూ ఉంటాడు—"యేదైనా ఉద్యోగం చేసి జీవన పరిమాణాన్ని ఎక్కువ చేసుకోరాదుటోయ్"— అని మాబోటి వాళ్లం ఎప్పుడైనా సలహా ఇస్తే,—"ఎందుకోయ్...సూర్యం! ఇది మాకు సరిపోదా...?" అంటాడు నిర్లిప్తంగా నవ్వి—ఆ నవ్వులోనే సంపూర్ణమైన శాంతీ... సౌఖ్యం... ..తృప్తీ ఉన్నట్లు గోచరిస్తాయ్ నాకు. నిరుడే రోజుల్లోనే సాంప్రదాయ కుటుంబంలోని ఒక అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకొన్నాడు.

అనుకోని హఠాత్తు మరణం! … … ఆధారం లేని ఆలుబిడ్డల ఆకలి మంటలు! ……దరిద్రదేవత ఆ ఇంటి ఇల్లాల్ని పట్టి, చుట్టి పీడుస్తూ ఆయింట్లో ప్రళయనృత్యం చేస్తోంది—

ఆరు నెలలనుండీ తీర్చుకోలేని ఇంటి అద్దె!! వసూల్‌కి వచ్చిన సేట్ పరమానందం రుద్రరూపంలో ఆ ఇంటిముందు నృశింహావతారంలా ప్రత్యక్షమయాడు.

ఇంట్లో సామానులు అన్నీ సేట్ పరివారం బైటకు నెట్టివేసేరు. కన్నీళ్ళు తుడుచుకొంటూ ఎదురుగా నున్న చెట్టు నీడని ఆశ్రయించింది వేదవతి బిడ్డను చంకలో వేసుకొని……

ప్రాణంకన్న ఎక్కువగా ప్రేమించి — సర్వస్వం ధారపోసి రచించిన కరుణాకరుని అమూల్య రచనా శిల్పం ఇప్పుడు రోడ్డుమధ్య ఎట్టిమట్టిలో పొర్లాడుతోంది. పెనుగాలికి రోడ్డుపై ఎగురులాడే కాగితాలు చూసేసరికల్లా నాకు ఏడు పొచ్చినంతపనైంది. స్వర్గవాసి కరుణాకరుని అవిరామకృషి బాధగా నా స్మృతిపథంలో మెదిలింది. చటుక్కున ఆ కాగితాలన్నీ యేరి చేతుల్లోకి తీసుకొన్నాను.

హఠాత్తుగా నన్ను చూసేసరికల్లా సేట్ పరమానందం తల్లక్రిందు లయాడు. పర్సు తీశాను. పరమానందం కళ్ళు ఆశగా మెరిశాయ్!! — వేదవతి కృతజ్ఞతతో జాలిగా నా కళ్ళల్లోకి చూసింది.

"ఈమాత్రందానికే పరువుగా బ్రతికిన ఆ ఇల్లాల్ని నడివీధి కెక్కించావా ... ?" నా కంఠంలోనుండి రౌద్రం ధ్వనించింది. డబ్బు తీసుకోవటానికి తటపటాయించాడు — "పర్వాలేదు ... తీసుకో ..." నీ కేం సేల్సుటేక్సు ఎక్కువ వెయ్యనులే" అన్నాను.

భయంగా అందుకొని జేబులో పెట్టుకొన్నాడు.

ఎప్పటిలాగే ఆ సామాన్లు అన్నీ లోపల సర్దించేసి నాకో సెల్యూట్ కొట్టి బజారులో పడి జనసమూహంమధ్య మాయమైపోయాడు.

మరొక పదిరోజులు తరువాత ఆ ఇంటి ముందునుండి నడిచి వెళుతున్నాను. కవికుమారుడు బాధగా గుమ్మంమధ్య కూర్చొని రోదిస్తున్నాడు. పితృప్రేమకి దూరమైపోయిన ఆ పసిపాపను చూస్తే నా హృదయం తరుక్కుపోయింది. చటుక్కున చేతుల్లోకి తీసుకొని బాధగా హృదయానికి హత్తుకొన్నాను. ఆమె ఎక్కడకు వెళ్ళిందని చుట్టుబట్ల భోగట్టా చేశాను. బ్రతుకు తెరువుకోసం ప్రతిరోజూ ఇంటింటికీ వెళ్ళి ట్యూషన్లు చెప్తూ వచ్చే స్వల్ప సంపాదనతో పిల్లణ్ణి పెంచుతున్నా దని మరొక ఇల్లాలు చెప్పింది.

ఎదురుగానున్న హోటల్లోనుండి యేదో తీసుకొచ్చి పిల్లవాని చేతిలో పెట్టాను. ఆకలితో చుట్టుకొంటూన్న ఆ పసిప్రాణి ఆశగా అందుకొని చటుక్కున నోట్లో కుక్కు-

కొన్నాడు ... పతనావస్థలోనున్న ఆ కుటుంబాన్ని చూస్తే సానుభూతితో కన్నీళ్ళు కారేయ్.

నిన్న అపరాహ్ణవేళ మండుటెండలో చేత్తో ఒక పెద్ద ఫైలు పట్టుకొని ఎదురుగానున్న ప్రెస్‌లోకి వెళ్ళింది. బహుశా కరుణాకరుని రచనలు పబ్లిషర్స్‌కి ఇచ్చేటందుకాబోలు! — అవును! యేంచేస్తుందీ !! ఆకలిమంటలు ఆర్పుకోనేటందుకు యేమైనా చెయ్యాలి! —

పాపం !! యేమన్నారో యేమో! చాలా విచారవదనంతో మెట్లుదిగి సొమ్మసిల్లిన బిడ్డను చేతుల్లోకి తీసుకొని ఆ మండుటెండలో మరొక ముద్రణాలయానికి నడచి వెళ్ళిపోయింది ఆ ఇల్లాలు —

కథానికల పోటీలో ప్రతినెలా అగ్రతాంబూలాన్ని అందుకొనే అతని కలం నేడు నడిబజారులో ఐదునయాపైసలు కూడా విలువ చెయ్యలేదు !! అక్కడ ఆగి కరుణాకరుని జీవిత పథాలవైపు వెనుదిరిగి చూస్తే బ్రతికీ చెడిన ఆ నిర్భాగ్యపు వనిత బాధగా నా స్మృతి పథంలో మెదిలింది.

అరగంట గడచింది —

ఆమె రాకపోవటంచూసి పిల్లణ్ణి క్రిందికి దింపి టైమ్ ఐపోవటంచేత ఆఫీసుకు వెళ్ళిపోయాను.

... ... ... ...

అబ్బా! ఆ కాళరాత్రి ఎంతభయంకరమైందీ !!

నేను వంటరిగా సముద్రపు వడ్డున కూర్చొన్నాను.

ఆ గాఢాంధకారంలో ఒక మానవాకారం తెల్లని వస్త్రమేదో ఇసుకమీద భద్రపరచి చరచర అడుగులేసుకొంటూ నా ప్రక్కనుండి నడచి సముద్రగర్భం లోనికి వెళ్ళిపోతోంది. పర్వతంలాంటి మనిషిని ప్రక్కని కూర్చొన్నాననికూడా గమనించలేదు — అవును ! చీకటి — ఎలా కనిపిస్తుంది!!

ఏంటో ఆ సాహసం !

ఎందుకో ఆ తొందర !!

బ్రతకాలనో … లేక చావాలనో … !! ఆ మానవాకారం ఈపాటికి బహుశా మునిగిపోయే ఉంటుంది —

కనీసం క్రాప్ అయినా దొరకొచ్చు అని చంగున ఎగిరి పట్టుకొన్నాను. మెత్తని జడపదార్థ మేదో దొరికింది. రెండుగుక్కలు నీళ్ళు మ్రింగే ఉంటుంది. ఆ ప్రాణి —

వడ్డుకి లాగాను.

ఎవరో స్త్రీ … …

బాహ్యప్రపంచంలోకి రాటానికి భయపడుతూ … సముద్రగర్భంలోకి పోటానికి తటపటాయిస్తోంది. నేను జుత్తు వదలనని కాబోలు —

చివరకి విసిగి వడ్డు ఎక్కింది.

ఆమె కెంత సాహసం !!

"మీ రెవరు !" చాలా సీరియస్‌గా ఉందాగొంతుక.

"దయాదాక్షిణ్యాలతో పుట్టిపెరిగిన ఒక మానవ హృదయాన్ని"

ఇదీ నా సమాధానం —

క్షణంలో నిశ్శబ్దం! మరుక్షణంలోనే "సూర్యం" అని ఆశ్చర్యంగా పిల్చిన పిలుపు —

"ఏంటీ ఘోరం...నువ్వా వేదవతీ...!" బిడ్డ డేడీ? భయంగా సముద్ర గర్భంలోకి చూస్తూ అడిగాను. పరుగెత్తుకు వెళ్ళి ఇసుకమీద గుడ్డలమధ్య భద్రంగా నిద్రపోతూన్న పసిపాపని భుజంమీద వేసుకొంది. బిడ్డని చూసేసరికల్లా నా మనస్సులో వీచిన తుఫాణ చల్లబడిపోయి నట్లైంది —

"ఏం చెయ్యమన్నావ్ సూర్యం! ఆయన పోయినా బిడ్డని చూసుకొంటూ బ్రతకా లనుకొన్నాను. బ్రతుకు తెరువు కోసం వెళితే నన్ను కారుచీకట్లమధ్యకు తరిమెయ్యటానికి విషపునవ్వునవ్వుతూ ఉజ్వల భవిష్యత్ వైపు చెయ్యి చూపించే ఆఫీసర్లు!! మీ రిచ్చిన రికమెండేషణ్ లెటర్ తీసుకొనివెళ్లాను. ఫలిత మిదీ! — బ్రతుకుమీద అసహ్యం కలుగుతోంది— స్త్రీ అందంగా ఆకర్షణగా పుట్టకూడ దీ ప్రపంచంలో ... నా బిడ్డకీ, నా ఆత్మకీ అన్యాయాన్ని తలపెట్టలేకయాను— నన్ను నిర్బంధించకు సూర్యం! ... నాకు బ్రతకాలని లేదు. నా జీవితానికి ఆత్మహత్యే శరణ్యంలా కనిపిస్తోంది. అందుకే ఈ నిర్ణయానికి వచ్చాను ... " అలా అంటూంటే ఆమె కళ్ళనుండి జలజలా కన్నీళ్ళు రాలాయ్ ...

బ్రతుకు తెరువు చూపిస్తా నని హామీ ఇచ్చి జీవితాశ కల్పించి నా రూమ్ కి తీసుకువచ్చేశాను.

మా ముగ్గురికీ యే అవినాభావ సంబంధమో, యే భగవతనుభంధమో!! ఎన్ని జన్మల బాంధవ్యమో!!

చిన్నప్పుడే మాతృప్రేమకి దూరమైపోయిన నేను మళ్ళా ఇప్పుడు మాతృదేవిలో ఉండే మాధుర్యాన్ని చవి చూడగలుగుతున్నాను. ఒక మాతృమూర్తి తన బిడ్డమీద ఎంత ప్రేమానురాగాలు చూపుతుందో అదే విధంగా ఆమె నన్ను చూస్తుంది. కుమారుడుగా ఆమె ఆదరణ పొందుతూ ఆమెను ప్రతిరోజూ పూజిస్తాను. మాతృస్థానంలో ఉండే విలువల్ని అర్థం చేసుకొంటాను.

ఆమెను తీసుకువచ్చి వారం రోజులైంది.

ఒక రోజున ఆఫీస్‌లో ఆరుజతల కళ్ళు ఒక దగ్గరచేరి గుసగుస లాడుకొంటూ నన్నుచూసి పరిహాసించి నవ్వుకోవటం మొదలు పెట్టాయ్. ఆ దృశ్యం చూసే సరికల్లా నా వంటి మీద తేళ్ళూ జెర్రెలూ ప్రాకినట్లైంది. నా వంటరి జీవితంలో యేంటో ఈ గాలిలేని తుపాన్!! వెధవ ప్రపంచము అనుకొంటూ నా పనిలో నేను నిమగ్నమైపోయాను. గడియారం పన్నెండు కొట్టింది. ఒకరిద్దరు తప్ప అందరూ భోజనానికి వెళ్ళిపోయారు. ఇంకా నేను టేబుల్ దగ్గరనుండి కదల్లేదు; అవసరమైన కాగితాలేవో సర్దుతూ.

"రావోయ్ పార్టనర్...ఇంకా ఎంతసేపు కూర్చొంటావ్ టైమ్ అయిపోయింది. త్వరగా హోటల్‌కి వెళ్ళి

భోజనంచేసి వద్దాం రా" అన్నాడు పక్క-సీట్లో కూర్చొన్న శర్మ. వాడి పక్కన మరొక ఇద్దరు కూర్చొని ఉన్నారు.

"వాడికి భోజనం ఎందుకోయ్? కేరియర్ వస్తుంది..." అన్నాడు రెండవవాడు అదోకలా నవ్వుతూ...

"శ్రీమతి వచ్చిందని నీకు తెలీదుటోయ్..."

"ఎక్కడనుండి కొట్టుకొచ్చాడో" — అన్నాడు రెండోవాడు మళ్ళీ.

పటప్...... నా కళ్ళు అగ్నిగోళాల్లా మెరిశాయ్. నా కంఠంలో రౌద్రం ధ్వనించింది. వాళ్ళని చీల్చి చెండాడెయ్యా లనిపించింది. చంగున సింహంలా ఎగిరాను. చిత్తుగా దేహశుద్ధి చేశాను. మెల్లగా ప్రాణాలు దక్కించుకొని ఆ ఇద్దరూ ఆఫీస్‌నుండి బైటపడ్డారు. ఆఫీస్‌లో నిల్చునేందుకు మనస్కరించక ఇంటిముఖం పట్టాను.

మా వీథిలో అడుగుపెట్టే సరికల్లా ఆ వీథి వాతావరణమంతా నాకేదో విచిత్రంగా కనబడింది. ఆ వీథిలోని అమ్మలక్కలందరూ నన్నొక మూజియమ్‌లోని వస్తువులా విచిత్రంగా చూస్తూ అర్థంకాని ఛల్లోక్తు లేవో విసురుతున్నారు. వినీ వినిపించుకోనట్లు తలవంచుకొని ఇంట్లోకి వెళ్ళిపోయాను. సరాసరిగా నా గదిలోకి వెళ్ళిపోయి పరుపుమీద బాధగా కూలిపోయాను. పిల్లాడు గచ్చుమీద కేరింతలు కొడుతూ ఆడుకొంటున్నాడు. పిల్లాణ్ణి చేతుల్లోకి తీసుకొని గట్టిగా

జాలితో హృదయానికి హత్తుకొన్నాను. కానీ నా బాధకు తగిన ఉపశాంతి కనబడలేదు.

వేదవతీదేవి ఫ్లాస్కుతో కాఫీ తీసుకొచ్చి టేబుల్ మీద పెట్టింది.

"ఏం సూర్యం...ఇవాళ ఆఫీస్‌కి వెళ్ళలేదా? కళ్ళు ఎర్రగా ఉన్నాయేం? ఆరోగ్యం బాగులేదా?" చాలా జాలిగా ప్రశ్నించింది. యేదో అగాధంలోనుండి మాట్లాడుతున్నట్లుంది ఆమె గొంతుక.

"బాగానే ఉందమ్మా......ఇప్పుడే ఆఫీస్‌నుండి వస్తున్నాను..."

కానీ నా సమాధానం మాత్రం ఆమెకు సంతృప్తికరంగా ఉన్నట్లు కనబడలేదు. నాల్గు రోజులనుండీ ఆమె కూడా యేదో వ్యక్తపరచలేని బాధను అనుభవిస్తూన్నట్లుగా కనబడుతోంది. ఆ బాధ ఏదో ఆమె నాకు విప్పిచెప్పదు. నేనూ అంతే—

అపోహాలూ ... అనుమానాలూ భరించలేక నా బుర్ర బరువెక్కిపోవటం మొదలుపెట్టింది. శరీరంలోని ప్రతి రక్తకణం ప్రతీకారంకోసం ఎదురుచూస్తోంది. ఒక టేంక్ పెట్రోల్ తీసుకొచ్చి ఆవీధినంతటినీ ముట్టించేయాలనిపించింది. ప్రతిరోజూ ఈ రాక్షస సమాజం కూసే పాడుకూతలు వినలేక నా చెవులు చిల్లులుపడటం మొదలుపెట్టాయ్. క్షణ క్షణానికీ అశాంతికీ ... అనారోగ్యానికీ దగ్గరైపోతున్నాను.

కొద్దిరోజులుపాటు ఈ వాతావరణాన్ని మర్చిపోయే టందుకు ఊరిలో గడిపిరావా లనిపించింది. మర్నాడే ఆమెకు కొంతడబ్బు ఇచ్చి ... బెడ్డింగ్ సర్దుకొని ఒకవారంరోజుల్లో వస్తానని చెప్పి ఆఫీసుకు శెలవుపెట్టి వెళ్ళిపోయాను.

నాకు మనశ్శాంతి ఎందుకులేదో — నేను నిద్రలేమి చేత ఎందుకు బాధపడుతున్నానో — నేను ఎందుకు అనారోగ్యంగా కనపడుతున్నానో ... నామనస్సు ఎందుకు గాయపడిందో ఆమెకు తెలుసు! ... వేదవతీదేవికూడా లోలోపలే కుములిపోతోంది. తన్నీ, బిడ్డనీ చేరదియ్యటంచేత నే నీ అపనిందలకు గురై మనశ్శాంతిని గోల్పోతున్నా నని ఆమె మథనపడుతోంది. నేను అతని జీవితపథాలమధ్య ఎదురవక పోతే ఆయన తన జీవితాన్ని ఎంతహాయిగా ఆనందంగా గడిపిఉండేవారోకదా...! అని వేదవతి బాధపడుతూన్నట్లు నాకు ప్రతిక్షణం కనిపిస్తోంది ... ఆమె ఆ విధంగా కలత పడటం నాకు మరింత వ్యథ కలిగిస్తోంది.

వారంరోజులుమాత్రం ఊరిలో గడిపాను—

కానీ మనస్సూ, మమతలూ, అన్నీ ఇంటిమీదే ఉన్నాయ్!! ప్రతిక్షణం వేదవతి జీవితం గురించీ ... బిడ్డ భవిష్యత్ గురించీ తప్ప — నామనస్సులో వేరే ఆలోచనలే రావ్! ప్రతినిముషం వాళ్ళిరువురి జీవితాలే నాస్మృతి పథంలో తిరుగుతూంటాయ్.

వేదవతికి వస్తానని చెప్పినరోజు ఈరోజుతోనే దాటి

పోయింది. ఇవాళ నేను రాలేదని చెప్పి తను ఎంతగా బాధ పడిందో !— నేను వస్తానని చెప్పి ఆశగా ఎన్నిగంటలు గుమ్మంలో నిల్చొని చీకటిపడేవరకూ ఎదురుచూసిందో!— పాపం !! మార్గంమధ్య యేప్రమాదం సంభవించిందోనని అనవసరంగా కళ్ళనీళ్ళు పెట్టుకొంటుంది. చీకటిపడేసరికల్లా మేతకు వెళ్ళిన బిడ్డ రాలేదని వచ్చిపోయే ఆలమందలవైపు పసరం ఎంతజాలిగాచూస్తుందో అదేవిధంగా అమెకూడా రోడ్డుమీద వచ్చిపోయే జనసమూహంవైపు చూస్తూ నా కోసం ఎదురుచూస్తుంది—

అబ్బా ! ఏంటీ ఏకాంతం — ఎన్నిరోజులు నాకీ నిశ్శబ్దం !! నే నీ వంటరిజీవితాన్ని ఇక్కడెంతమాత్రం భరించలేను. బిడ్డ నవ్వుతూ కేరుతూ నాకళ్ళముందు ప్రతి క్షణం కనబడితేకాని నేను బ్రతకలేను — మాతృమూర్తి మందలింపులు వినబడితేకాని నే నుండలేను—వేదవతి నా ఊపిరి — బిడ్డ నాగుండె — వాళ్ళిద్దరూ లేకపోతే నే నొక్కక్షణంకూడా జీవించలేను.

నిర్భయంగావెళ్ళి పెద్దమనుషులమని చలామణీ అవుతూన్న ఈ గ్రుడ్డిలోకానికి చక్కని గుణపాఠాన్ని నేర్పాలి! సంఘం కఠిన కర్కశ కంఠాలమధ్య నలిగిపోయే మాలాటి నిర్భాగ్యుల్ని మేమే రక్షించుకోవాలి. నా ఆదర్శాల అంతరార్థం అపార్థకల్పన చేసింది. జీవిత సుడిగుండాలమధ్య నలిగి పోయిన ఆ నిర్భాగ్యపువనితని అర్థంచేసుకోలేక ఆమె నెంత్లో

ఆరాటపరిచింది. మమ్మల్ని అపఖ్యాతికి ఆహుతిచేసిన ఈ అమ్మలక్కల్ని చీల్చిచెండాడాలి !!! అప్పటికాని మా జీవితాలకు శాంతిలేదు—

ప్రసిద్ధరచయిత హఠాత్తుమరణం — ముక్కుపచ్చలారని పసిపాప — యవ్వనఛాయల్లోఉన్న ఆ ఇల్లాలు — అవివాహితునిగాఉన్న నేను చేరదీసి యేదో స్వార్థంకోసం ఇంట్లోపెట్టుకొని భార్యలేనిలోటు తీర్చుకొంటున్నానని అనుకొంటూంది ప్రపంచం !—

కొన్నివేల కంఠాలు ప్రతిరోజూ నా కర్ణపుటాలను కలచివేస్తూంటాయ్. ఆబాధ భరించలేను. ఆమాటలకి తట్టుకోలేను.

అయ్యో ! పరమేశ్వరా !! ఆమె నిరపరాధిని. నన్ను కరుణాస్వరూపునిగా ఎందుకు సృష్టించావ్ నాయనా ? ఆ నిర్భాగ్యపు వనితని నాకెందుకు పరిచయంచేశావ్ తండ్రీ ? ఈ అంతర్నాటకంలో ఆమెను ఎందుకు ప్రవేశపెట్టావ్ ప్రభూ ! ఆ పుణ్యస్త్రీ జీవితాన్ని ఈ గ్రుడ్డిసంఘం ఎంతగా పరిహసిస్తోందో నీ త్రికంటిని విప్పి చూడలేదా తండ్రీ ! ఆమె కార్చే కల్మషరహితమైన కన్నీరు నీపాదసన్నిధికి పారలేదా ప్రభూ ? ఆ ఇల్లాలి ఆత్మఘోష చల్లార్చు తండ్రీ ! ఆ పతివ్రతామతల్లిహృదయభారాన్నితగ్గించుతండ్రీ! అగ్నిహోత్రంలాంటి ఆమెశీలాన్ని శంకించిన ఈ రాక్షస సమాజాన్ని శిక్షించి భక్షించలేవా ప్రభూ! ఆకాళరాత్రి సముద్రగర్భంలో

ఆమె ప్రాణాల్ని నాచేత ఎందుకు రక్షింపజేశావ్ తండ్రీ ! ఈ నిందలు మోపి ఆమెను చిత్రవధచేసి చంపేకంటె ఆనాడా సముద్రగర్భంలోనే హతమార్చలేకపోయావా తండ్రీ ! కుళ్ళుతూ — చివుకుతూ — చిక్కి శల్యమవటం నేను చూళ్ళేను — త్వరగా ఆమెను కరుణించి రక్షించు ప్రభూ !

*    *    *    *

సాయంకాలం ఐదుగంటలైంది.

ఇంట్లో అడుగుపెట్టేసరికల్లా వేదవతి చిరునవ్వుతో ఒక ఉత్తరాన్ని తీసుకొచ్చి నాచేతుల్లో పెట్టింది. దాన్ని ఇప్పి చదువుకొన్నాను.

పెళ్ళిచేసుకొని ఒకింటివాణ్ణి అవమని చెప్పి మానాన్న ఉత్తరంరాశారు. ఆ ఉత్తరాన్ని పూర్తిగా చదువుకొని చాలాసేపు నాలోనేనే నవ్వుకొన్నాను. "నాకడుపు నో కసు గాయ కల్గితే వాణ్ణి కళ్ళారాచూసి కళ్ళుముయ్యా"లనిఅతని ఆశ — అలాగేలెండి అనిచెప్పి వెంటనే జాబు రాశాను—

ఉన్నట్లుండి ఒకరోజున ఉత్తరమైనా రాయకుండా ఊడిపడ్డారు. నలుగురూ నాలుగువిధాలుగా నాగురించి చెప్ప టంచేత నా ప్రత్యక్ష జీవితాన్ని ఒకసారి సడన్‌గా చూడా లనికాబోలు వచ్చారు. ఉత్తరం రాయకుండావచ్చేఅలవాటు ఆయనకి ఏనాడూ లేదు. నా వ్యక్తిగతజీవితం గురించి ఆయనకీ పెద్ద అనుమానం తోచింది. అందుచేతనే ఆయన మాట్లాడేపద్ధతికూడా మారిపోయింది. ఏవో కొన్ని ప్రశ్నలు

అడిగారు. సరియైన సమాధానం చెప్పాను. కొన్ని సమాధానాలు ఆయనకి అసంతృప్తికరంగా తోచాయి. నా హృదయాన్ని ఆయన అర్థంచేసుకోలేకపోయారు. అతనికోర్కెను నేను గౌరవించలేకపోయాను. మనస్సులో యేవో భేదాభిప్రాయాలు వచ్చాయ్. మా హృదయాల్లో జనించిన పరస్పర విరుద్ధశక్తులపోరాటంలో తండ్రీకొడుకుల మిద్దరమూ దూరమైపోయాం. మేమిద్దరం విచిత్రవ్యక్తుల్లా కనుపిస్తాం ప్రపంచానికి — బాహ్యప్రపంచానికి బద్ధవైరుల్లా కనుపిస్తాం కానీ ... ప్రేమాభిమానాల్ని గోల్పోని అనుబంధం మాది.

* * *

ఆరునెల్లఅనంతరం నేనేదోపత్రిక తిరగేసి చూస్తూంటే కీ॥ శే॥ కరుణాకరుడు ఎంతో ధన్యుడు అనుకొన్నాను. ఆనాడు అతనికి మృత్యువుని ప్రసాదించిన ఆ ఉత్తమరచన నేడు అంతర్జాతీయ కథానికలపోటీలో ఉత్తమరచనగా ప్రథమ బహుమతి పొందింది. వేదవతిని పిల్చి చదివి చూపించాను ...

ఆమె ఆ పేజీవైపు నిర్లిప్తంగా చూసింది. మరుక్షణంలోనే ఆమె కళ్ళు కన్నీళ్ళతోనిండిపోయాయి. అవి ఆనందబాష్పాలో లేక విషాదబాష్పాలో మాత్రం నేను చెప్పలేను —

మా జీవితపథాలమధ్య ఆరుమైలురాళ్ళు అతివేగంగా దొర్లిపోయాయ్ ...

ఆరోజు రాత్రి ఏడుగంటలైంది.

నేను లైటుముందు పేపరు చదువుకొంటున్నాను. బాబు నా పక్కనే కూర్చొని తెనుగుపత్రిక లేవో తిరగేస్తు న్నాడు. వేదవతీదేవి పక్కనున్న వస్తువు లేవో అల్మరాలో సర్దుతోంది.

"ప్రసిద్ధరచయిత మరణించాడు...ఇంక అతనికథలు చదివి ఆనందించే అదృష్టం పాఠకలోకానికి లేదు. ఆంధ్ర వాణి అస్తమించింది ..." ఇంకా యేదో గట్టిగా చదువుకు పోతున్నాడు బాబు.

"ఇంకచాలు ... నీ వాచకంపుస్తకం చదువుకో" వేదవతి యేదో వ్యథతో ఆ పుస్తకాన్ని చేతుల్లోనుండి లాక్కొని బీరువాలో పడేసింది. ఆమె ముఖంలో అనిర్వాచ నీయమైన బాధ ఏదో వ్యక్తమైంది. మానిపోతూన్న గాయాన్ని మళ్ళా కెలికినట్లైంది ఆమెకు —

"బాబాయ్ ... చూశావా ... పుస్తకం చదువు తూంటే అమ్మ లాక్కొంది" అంటూ ఏడుపుముఖం పెట్టేడు బాబు. "అటువంటి పుస్తకాలు చదవకూడదు నాయనా... నీ క్లాస్ పుస్తకాలు చదువుకోవాలి." అంటూ గట్టిగా మందలించాను.

* * *

వృద్ధాప్యంలో జీవితం చాలా దుర్భరంగా ఉన్నా దని, ఉద్యోగానికి రిజైన్ చేసేసి ఉన్న ఆస్తిపాస్తులు ...

చూసుకొంటూ ఇంటికివచ్చి పెళ్ళిచేసుకొని ఒకింటివాణ్ణి అవమని చెప్పి నాన్నగారు ఎన్నో ఉత్తరాలు రాశారు.

ఎప్పటికైనా పెళ్ళి చేసుకొంటానని, చేసుకొనే పక్షంలో మీకు తెలియబరచకుండా మూ్రతం చేసుకోనని హామీఇచ్చి ఉత్తరం రాశాను — నిజానికి ఆ ఉత్తరాన్ని చూసి అప్పటికి సంతోషించినా తరువాత బాధపడే ఉంటారు.

నా వైవాహికజీవితం నా జీవితపథాల్ని ఆదర్శాలనీ మార్చేస్తుందేమో అని భయపడ్డాను. వైవాహికబంధంతో, నా జీవిత బంధానికి దెబ్బతగుల్తుందేమో అనే భయంకొద్దీ అప్పట్లో ఆ సమస్యని పరిష్కరించే అందుకు పూనుకోలేదు. అప్పట్లో వేదవతికూడా నన్నొక ఇంటివాణ్ణి అవమని చెప్పి చాలాసార్లు బ్రతిమాలింది. చివరకి ఆమె కోర్కెను కూడా గౌరవించలేకపోయాను.

తరువాత చాలారోజులకు ఆ సమస్య రానూలేదు — నేను దానిగురించి ఆలోచించనూ లేదు. మళ్ళా చాలా రోజుల తరువాత మానాన్న ఉత్తరం రాశారు. అదే ఆయనరాసిన ఆఖరి వుత్తరం!! నేను ఇచ్చిన చివరిజవాబూ!!! ఏమనుకున్నారో యేమో, ఇంక ఆయన ఉత్తరం రాయ లేదు. మా ఇరువురిమధ్యా చాలా సంవత్సరాలు ఉత్తర ప్రత్యుత్తరాలు లేకుండానే ... క్షేమసమాచారాలు తెలియ కుండానే దొర్లిపోయాయి. మా ఇరువురిమధ్యా యేదో

తెలీని ముభావం పెట్టనిగోడలా నిల్చిపోయింది. నా గురించి అతను ప్రతిక్షణం మథనపడుతూనే ఉంటారు. అతనిగురించి నేను ప్రతి ఘడియా ఆలోచిస్తూనేఉంటాను.

ఇరవైనాల్గు వసంతాలు దొర్లిపోయాయి. ఒకరోజున బాబు ఏకాంతంగా తనగదిలో కూర్చొని యేదో రాస్తు న్నాడు. బహుశా అదేదో కథానికై ఉంటుంది. మహా గంభీరంగా రాస్తున్నాడు... ...అందులోనే యేదో తెలీని తన్మయత్వాన్ని పొందుతున్నాడు. కుమారుని ఆవేశాన్ని చూస్తూ ఆమె హడలిపోయింది. "చినబాబూ! మళ్లా కథానికలు రాయటం మొదలుపెట్టావా ... ?" ఇరవై ఐదుసంవత్సరాలక్రితం తన జీవితాన్ని తల్లక్రిందులుచేసిన విషాదసంఘటన బాధగా ఆమె స్మృతిపథంలో మెదిలింది కాబోలు! కుమార్డు తండ్రిఅడుగుజాడల్లో అనుసరిస్తూండటం చూసి. అందుకే ఆమె కళ్ళల్లో కన్నీళ్ళు తిరిగాయ్.

ఆమె నిశ్శబ్దంగా వెళ్ళి తనపక్కని నిలోచ్చటంచూసి కలం ఆపి, తలెత్తి తల్లికళ్ళల్లోకి చూసి, యేమనుకొన్నాడో యేమో ... చటక్కున లేచి, —

"క్షమించు అమ్మా! ఇకనుండీ నీ మనస్సు కలత పెట్టను ... ఎప్పుడూ కథలు రాయను." ఆమె కన్నీళ్ళు తుడుస్తూ క్షమాపణకోసం తల్లిచేతులు పట్టుకొన్నాడు. మాతృహృదయం జాలితో కరిగిపోయింది.

* * *

గడచిన ఇరవై ఐదుసంవత్సరాలలోనూ మా జీవితా లలో అనుకోని మార్పు లేమీ రాలేను. కళంకరహితమైన బ్రహ్మచర్యంతో అర్థ శతాబ్దం తిరిగిపోయింది. ప్రమోష న్లతో ప్రతి సంవత్సరం పై మెట్టు ఎక్కుతూనే ఉన్నాను. సర్వీస్‌లో నా తల పండిపోతూనే ఉంది. రోజుకిరోజూ నా శరీరంలోని శక్తి సడలిపోతూనే ఉంది —

వృద్ధాప్యంలో ఇంకా సజీవంగానే ఉన్న నా తండ్రి గారిని చూడా లనిపించింది. ఇంత కాలం లేని ఈ ఆలోచన ఇంత సడన్‌గా ఇప్పు డెందుకు కలిగిందో నాకు అర్థం కాలేదు. చిన్నప్పటినుండీ నా స్వహస్తాలతో పెంచి పెద్దవాణ్ణి చేసిన చినబాబు వివాహవిషయంగురించి ఆలోచిస్తూంటే నాన్న నా స్మృతిపథంలో మెదిలారు.

పితృస్థానంలో ఉండే అవ్యక్తానురాగాన్ని అర్థం చేసుకొన్నాను.

ఆ రోజు జ్ఞాపకంవస్తే నా కళ్ళంట కన్నీళ్ళు తిరుగు తాయ్ !

ఇరవైనాల్గు సంవత్సరాల్ క్రితం ఒకరోజున కలకత్తా మద్రాస్ మెయిల్‌లో ప్రయాణం చేస్తూంటే తలవని తలంపు గా ఆయన వాల్తేర్ ప్లాట్‌ఫారంలో బండెక్కి నా కంపార్టు మెంట్లో నా పక్కనే కూర్చోటం జరిగింది. ఆయన నా పక్కని కూర్చోనేసరికల్లా పట్టలేని ఆనందాన్ని పొందేను. మళ్ళా విధి మా ఇద్దర్నీ కలుపుతూం దనుకొన్నాను. కాని

ఒక పాసంజర్‌ని చూసినట్లు మామూలుగా నా వైపు కూడా ఒకసారి చూశారు. ఆయన ముఖంలో యే కోపా వేశమూ ఉన్నట్లు నాకు స్ఫురించలేదు. నిశ్చలంగానే ఉన్నాయ్ అతని చూపులు.

ఆరోజున ఆయన నన్ను పితృవాత్సల్యంతో పలుక రించనూలేదు; నేను పూజ్యభావంతో ఆయన్ని గౌరవించి మాట్లాడనూలేదు !! ఆయన ఇంకా ఎక్కడికో ఆ రైల్లో చాలాదూరం ప్రయాణం చేస్తూన్నట్లు కనబడ్డారు. బహుశా మా అక్కయ్యదగ్గరకి వెల్తూరు కాబోలు—అనుకొన్నాను. నిశ్చింతగా బెర్త్‌మీద బెడ్డింగ్ పరచుకొని నిద్రపోతున్నారు. పాపం!! తన బ్లేంకెట్ తెచ్చుకోవటం ప్రయాణసన్నాహంలో మర్చిపోయారు కాబోలు. కాళ్ళకు, కట్టుకొన్న పంచకొంగే తీసి కప్పుకొన్నారు. ఎముకలు విరగ్గొట్టే చలి చూస్తే నాకు చాలా బాధ కలిగింది. నా బెడ్డింగ్‌లోనున్న పచ్చబ్లేంకెట్ తీసి ఆయనమీద కప్పేను.

నేను దిగవలసిన స్టేషన్ వచ్చేసింది. నేను అక్కడ దిగిపోక తప్పదు. కప్పిన బ్లేంకెట్ పక్కకు తొలగించి అతని పాదాలు కళ్ళ కద్దుకొని నమస్కరించాను. ఆయన తెలివి తెచ్చుకొన్నట్లు కనబడదు. ప్రయాణబడలికలో వళ్ళుమరచి నిద్రపోతున్నారు. లెదరు బేగూ బెడ్డింగ్‌తో నన్ను క్రిందకి దింపి గట్టిగా నవ్వుతూన్నట్లు గర్జించి ముందుకు కదిలి పోయింది — మెయిల్.

ఇంటికివెళ్ళి లెదర్ బేగ్ తెరిచేసరికల్లా నేను ఆశించిన వారపత్రికకి బదులూ, సరిక్రొత్తవి కరంసీనోట్లు కనబడ్డాయ్. సగానికి పైగా వంద రూపాయల నోట్లే ... వందకుపైగా ఉన్నాయ్.

నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. పైన తెల్లని కాగితం కనబడింది —

"పెళ్ళిచేసుకొని వంశాన్ని ఉద్ధరించు నాయనా..." మా నాన్న స్వదస్తూరితో రాయబడి ఉంది ఆ కాగితం.

ప్రత్యక్షంగా ఇస్తే తీసుకోనని చెప్పి పరోక్షంగా నా కన్ను చాటుచేసి నేను ప్లేట్‌ఫారంలో ఎక్కడో దిగిన తరువాత పెట్టిఉంటారు. కోరి పెళ్ళిచేసుకోమని యిచ్చిన ఆ డబ్బు చూస్తూంటే నాకు నవ్వొచ్చింది. మరుక్షణంలో నే తన అభీష్టాన్ని నెరవేర్చలేకపోయానని చెప్పి కన్నీళ్ళుకూడా కారేయ్.

పన్నెండుసంవత్సరాల అనంతరం మళ్ళా ఒకరోజున ఆయన నా జీవితపథాలమధ్య అనుకోకుండానే తారసిల్లారు ఒక సత్రంలో — బాగా నెరసిన ఒక పొడుగాటి గెడ్డం... నిశ్చలమైన చూపులూ చూస్తూంటే వియోగబాధ అనుభవిస్తూన్నట్లు కనబడలేదు. ఎంతో నిశ్చింతగా ఉన్నారు. ఆ సత్రంలో ఆ రోజునకూడా ఒకరివైపు ఒకరం అపరిచిత 'ముసాఫిరి'ల్లాగే చూసుకొన్నాం. కానీ ఆయన పెదవి కదపి మాట్లాడలేదు — ఐనప్పటికీ మాలో ఏమేమో తెలీని

బాధతో కృంగిపోయాం ... మళ్ళా హృదయాల్లో ఒకరి మీద ఒకరికి అవ్యక్తానురాగమే ఉదయించింది.

అప్పుడు కూడా నన్నేదో తెలీని తృప్తి పెట్టి పంపించేశారు ... నేనూ అంతే ...

— ఆధ్యాత్మిక చింతతో జీవిస్తూన్న ఆయన "సీతారాములు" కంచువిగ్రహాల్ని చూసుకొని ఎంతగా పరవశు లయారో ...

ఆ రోజునే ఆయణ్ణి కడసారి చూశాను !! ... మళ్ళా మే మిరువురం నేటివరకూ ఎక్కడా తారసిల్ల లేదు. ఆయన జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నా కళ్ళు కన్నీళ్ళతో చెమ్మగిల్తాయ్.

వృద్ధాప్యంలో ఇంకా సజీవంగానే ఉన్న నా తండ్రి గారిని వెళ్ళి చూడా లనిపించింది.

ఒక శుభదినాన్ని నేనూ, బాబూ, వేదవతీ ముగ్గురం వయోవృద్ధులైన తండ్రిగారిని చూసేటందుకు స్వగ్రామానికి బయల్దేరాం !! ముందుగా నాన్నగారికి ఉత్తరం రాశాను. ఆయన ఆనందాన్ని పట్టలేకపోయారు. స్టేషనుకి కారు పంపుతా నని చెప్పి టెలిగ్రాంకూడా ఇచ్చారు ... నా మనస్సు పరవశంతో నిండిపోయింది.

మూడువందలమైళ్ళు ప్రయాణం చేసిన అనంతరం తెలతెలవారుతూంటే మేం దిగవలసిన స్టేషన్ వచ్చేసింది. ఆ స్టేషన్ చూసేసరికల్లా నా కెంతో ఆశ్చర్య మేసింది. ఇరవై ఐదు సంవత్సరాలక్రితం అదొక చిన్న షెడ్. ఇప్పుడు

చూట్టూని కెంతో ఆకర్షణీయంగా కట్టబడిన రెండంతస్థుల కాన్క్రీట్ బిల్డింగ్ ... మునుపు అక్కడ మెయిల్ రెండు నిముషాలు మాత్రమే ఆగేది. ఇప్పుడు అరగంటకుపైగా ఆగుతోంది.

బాబు లైసెన్సుకూలీని పిల్చి పెట్టెలోనున్న సామా నంతా ప్లేట్ఫారంమీద పెట్టించాడు. నేను ఆతృతగా బైటకు నడిచాను కారుకోసం. ఎదురుగానున్న కారుస్టేండ్లో లెక్కలేనన్ని కార్లు బారులుతీసి నిల్చొని ఉన్నాయి. ఇరవై ఐదుసంవత్సరాలక్రితం మా కారు ఏ కలర్లో ఉండేదో నాకు చటుక్కున జ్ఞాపకం వచ్చిందికాదు. "స్టుడీబేకర్ డీలగ్జ్" అనిమాత్రం తెలుసు. నెంబర్మాత్రం మర్చిపోలేదు. చాలాసేపు ఆందోళనగా వెతికేయ్ నాకళ్ళు. ఆఖరికి చిట్ట చివరనున్న పాతబడిన కారుమీదకి పోయింది నాదృష్టి. అవునా, కాదా అనిచెప్పి కళ్ళజోడుతీసి కళ్ళు పెద్దవిచేసుకొని మరొకసారి నెంబర్వైపు చూశాను. A. M. D. 14366. నిస్సందేహంగా అదే!! చటుక్కున తలుపు తెరచాను. దళసరిపాటి కళ్ళఅద్దాలు పెట్టుకొని ఆ వృద్ధాప్యంలోకూడా యేదో ఇంగ్లీషు పేపరు ముఖానికి దగ్గరగా పెట్టుకొని చదువు కొంటున్నారు. ఆయన్ని పోల్చి పట్టేందుకు చాలా టైమ్ తీసుకొంది.

"నాన్నా ..." అంటూ పిచ్చిగా అరచాను. చటు క్కున చదువుతూన్న పేపర్ దించి ముఖమెత్తి చూశారు,

"వచ్చావా ... నాయనా !!" ఆప్యాయతతో నాకు దగ్గరగా వచ్చి తన చల్లని చేతులతో నా శరీరాన్ని అంతా స్పృశిస్తూ పట్టలేని ఆనందంతో హృదయానికి హత్తుకొన్నారు. తొలి చూపులోనే అతని శరీరమంతా మూడింతన్న మెత్తగా ఐపోయినట్లు కనబడింది. తండ్రీ కొడుకుల మిద్దరం మళ్ళా ఇలా కలుసుకొన్నందుకు మా కళ్ళనుండి ఆనందబాష్పాలు రాలేయ్.

ఇంతలో సామానంతా లైసెన్సు కూలీలతో కారు లోపల పెట్టించి, వేదవతీ, బాబూ ఇద్దరూవచ్చి ఆయన పాదాలకు నమస్కరించారు. "ఇంత కాలానికి నామీద దయ కలిగిందా అమ్మా..." అంటూ ఇరువురిన్నీ బ్రహ్మానందంతో హృదయానికి హత్తుకొన్నారు. అంత మహానందంలో కూడా నన్ను చూస్తూంటే అతనికళ్ళల్లో యేవో అసంతృప్తి చిహ్నాలు నాకు గోచరిస్తూనే ఉన్నాయ్.

తన జీవిత కాలంలో కోడల్ని చూడలేకపోయాను కదా అనే దిగులే అతన్ని ప్రతిక్షణం బాధిస్తూనే ఉంటుంది. ఆ కోర్కె మాత్రం అతని జీవితంలో తీరని వెల్తిగానే ఉండి పోయింది.

డ్రైవర్ కారు స్టార్టు చేశాడు. ఒక మైలు దూరం వరకూ శరవేగంలో పోయి చటుక్కున ఆగిపోయింది. జన సమూహంతో రోడ్డు అంతా నిండిపోయి ఉంది. కారు ముందుకు కదలలేదు. చుట్టూవున్న జనసమూహాన్ని చూస్తూ

ఎదురుగానున్న బిల్డింగ్ వైపు చెయ్యిచూపిస్తూ పన్నెండేళ్ళ పిల్లవాణ్ణి పిలచి ...

"అదేంటి...! ఈ జనసమూహమంతా ఇక్కడ కెందుకొచ్చారు..." అని అడిగాడు బాబు.

"ప్రసిద్ధ రచయిత కరుణాకరుడు మరణించాడు!! అతని స్మారకార్థం ఆదర్శకవితామండలి కరుణాకరుని ఇరవై నాల్గవ జయంతి స్మృతి చిహ్నంగా చేస్తున్నారు." అంటూ విచారకరంగా ముఖంపెట్టి చెప్పాడు— మాకళ్ళు కన్నీళ్ళతో నిండిపోయాయ్.

ఇంటిముందు కారు ఆగింది ...

ఇల్లు చాలా దీనావస్థలో ఉన్నట్లు కనబడింది. పాతిక సంవత్సరాలనుండీ ఇంటికి ఎటువంటి మరమ్మత్తూ చేసి ఉన్నట్లు కనబడలేదు. పూలమొక్కలన్నీ అంత్యమ జీవితంలో అడుగుపెట్టి దీన స్థితిని వెళ్ళబోస్తున్నాయ్.

ఇంట్లో అడుగు పెట్టేసరికల్లా ఇల్లు అంతా కలకల లాడుతోంది. చిన్నఅక్కపిల్లలతో ఇల్లుఅంతా నిండిపోయి ఉంది. బాగా తల నెరసిపోయిన చిన్నక్క కూతుళ్ళ తోనూ, మనుమరాళ్ళతోనూ వచ్చీరావటంతోనే పలుక రించి ఆశ్చర్యపోయింది.

"ఎంతకాలానికి చూడగలిగానురా తమ్ముడూ...!" అంటూ సంతోషాన్ని పట్టలేకపోయింది.

వేదవతినీ, రామూన్నీ చూసి ఆశ్చర్యపోయారు—

"ఈ అబ్బాయ్ వేదవతి కొడుకా_దూ.?"
అని ఆశ్చర్యంగా ప్రశ్నించింది అక్కయ్య ...

"ఔను అక్కయ్యా ... మొన్ననే బి. యల్. పాసయ్యాడు" అన్నాను.

పదహారేళ్ళ అమ్మాయ్ విలాసంగా జడ అల్లుకొంటూ పాటపాడుతూ గదిలోనుండి హాల్లోకి వచ్చి ... మమ్మల్ని చూసి నాలిక కరుచుకొంటూ చటుక్కున సిగ్గుతో లోపలకు వెళ్ళిపోయింది.

"ఆ రెండు జడల పిల్ల ఎవరే? అని అడిగాను?

"నా చిన్న కూతుర్రా ...," అంది నవ్వుతూ.

"నీ కష్టాలు గట్టెక్కాయ్ అమ్మా ... అంది బాబును చూస్తూ వేదవతితో —

"అదంతా సూర్యం చేతి చలవ..." అంది వేదవతి కృతజ్ఞతా పూర్వకంగా చిరునవ్వు నవ్వి....

ఒక రోజున చిన్నఅక్క తన కూతురు శారదని కోడలుగా చేసుకోమని వేదవతిని కోరింది. ఆ మాటకి జవాబుగా వేదవతి, శారదని చూస్తూ సజీవమైన ఒక్క చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వులో నాకు సంపూర్ణ శాంతి లభించింది—

(బహుమతి పొందిన కథానిక)

# కూలిన ఇల్లు

[ఆగిపోయిన జీవితాలే అనంతాకాశంలో ప్రతిఫలించే నక్షత్రాలు ... భూతలంమీద తావులేక అనంతాకాశం మీదికి పోయి హాయిగా మెరుస్తాయ్—

నా లాడ్జి కెదురుగానున్న ఆ మట్టిగోడల్ని ప్రతిరోజూ చూస్తూనే ఉంటాను—కాని ఆ మొండిగోడల మధ్య మరుగుపడి ఉన్న విషాద చరిత్ర నే నెన్నడూ తెలుసుకోనేటందుకు ప్రయత్నించలేదు.

ఆ దారిని పోయే మనలాంటి జాలిగుండెలను ఆ విషాదదృశ్యాలు కొన్ని క్షణాలసేపు అక్కడనిల్పి ... యేదో కన్నీటి గాథని వినిపిస్తూ ఉంటాయ్ ! !—

చరిత్ర హీనుల నిరర్థక జీవితాలేవో ఆ మట్టిపెల్లలమధ్య పూడ్చ బడ్డాయ్—

కాలగర్భాన్ని పెకలించి చూస్తే ... అడుగడుగునా అభాగ్య వనితల కన్నీటి గాథ లెన్నో మనకి కనిపిస్తూనే ఉంటాయ్ !]

*　　*　　*

అది శివాలయానికి పశ్చిమంగా ఉన్న పల్లపువీధిలోని కడపటి గడప ! !

పేదత్వమూ ... అసహ్యమూ ... దరిద్రమూ తాండ వించే నిరుపేదల పూరిళ్ళకు దరిదాపుల్లో ఉన్నా దా పెంకు టిల్లు!— అది కొన్ని తరాల క్రిందట యే బీసీ నాడో కట్టిన దని తొలిచూపులోనే అర్థమౌతుంది. చాలవరకూ పూర్వ వైభవాన్ని కోల్పోయింది. ఆ శిథిలగృహాన్ని ఇంటి

యజమాన్లు ఎప్పుడూ మరమ్మత్తు చేసుకొన్నట్లు కనబడదు. అక్కడక్కడ శిథిలమై పోగా మిగిలిన ఒకగదిపట్టు మాత్రం పూర్తిగా తన ఆకారాన్ని గోల్పోలేదు—అందులో, రెండు అనాథజీవులు చాల యేండ్లనుండీ కాపుర ముంటున్నాయ్—

చీకటి పడింది—

కానీ అందులో దీపం వెలిగించినట్లు కనబడదు—

ఆ ఇంట్లో బాధగా ఒక మూల్గు ... వెనువెంటనే భారంగా ఒక నిట్టూర్పు — ఆవృద్ధమాత గుండెల్లోనుండి యేవో శోకస్వరాలు బైటకు వస్తున్నాయ్. ఆమె అస్వస్థత వల్లే అలా బాధపడుతోందో లేక మానసికాందోళనవల్లే అలా బాధపడుతోందో చటుక్కున ఊహించటం కష్టం. తనబిడ్డ మీద పెట్టుకొన్న ఆశా, ఆదర్శాలు కూలిపోయే చివరిరోజు అది—కన్నకలలన్నీ కన్నీటి కాల్వలయే ఆఖరిక్షణ మది—

చీకటిపథాల మధ్య చీలిక లవబోయే కుమార్తె జీవి తాని కొక ధృవతారై వెలుగుబాటల్లో నడిపించింది. ఆదర్శ పథాలు తొక్కిస్తూ నేటివరకూ ఆ మాతృమూర్తి వెయ్యి కళ్ళతో కాపాడుతూ వచ్చింది. చీకటి పడినా తన చిట్టి తల్లి ఇంకా ఇంటికి చేరుకోలేదేం......???

బహుశా ఈ ఆలోచనలే ఆమెను నిలువునా కృంగ దీస్తూ...మనశ్శాంతిని మానసిక హద్దుల్లో నుండి చీకటి లోయల్లోకి లాగేస్తున్నాయ్. అలాగే ఇప్పుడు నీలూ కూడా ...! ఛా..., ఏంటీ విపరీత ఆలోచనలు? నీలూ తనింటి

ఎందుకు ఆదర్శవనిత కాకూడదూ ??? ఏమో! — గులకరాళ్ళమధ్య రత్నాలు పుడతాయా? కాకి కోయిల్ని కంటుందా? తనకి నమ్మకం లేదు—

రాజారావ్ నీలూని తనింటికి ఎందుకు పిలిపించాడూ? పద్దులు చూసుకోవలసొస్తే అదెందుకూ? దానికేం తెలుసు!! వెర్రిపిల్ల—సంవత్సరాంతం కూడా కాలేదే! ఏం పుట్టి మునిగిపోయిందని కబురు పంపించాడూ? పెద్దదిక్కు నేనున్నానని తనకి తెలీదా? దుర్మార్గుడుకి ఏదో దుర్బుద్ధి పుట్టింది... అంత్యఘణాలు దగ్గరపడ్డాయ్. అన్యాక్రాంతం చేసి అందరిసొత్తూ అపహరించాడు! తరతరాలనుండీవచ్చే ఆస్తిపాస్తులు తన వని వాదించాడు ... అన్నిటికీ తను తలొగ్గింది! ఇంకా మమ్మల్ని ఇలా బ్రతకనివ్వటం ఇష్టం లేదు కాబోలు—

కుళ్లుతూ...చివుకుతూ ... రొచ్చులతో రోగాలతో అన్నిటినీ భరిస్తోం దా శరీరం !! ఎన్ని జన్మలకీ అలాగే ఉండాలి—అందరి ఉసురూ పోసుకొన్నాడు ..., ఊరికే పోతుందా ?

తనెంత దౌర్భాగ్యురాలూ...

ఎదిగిన కుమార్తెకు వరుణ్ణిచూచి వివాహం చెయ్యలేక.పోయింది. ఆబాధ ఆమెను నిత్యం కృంగదీస్తోంది. గుబురుగా పెరిగిన నీలూ అందం ... యథేచ్ఛగా పెరిగిన

యవ్వనపు పొంగూ ... చూసినప్పుడల్లా ఆ మాతృమూర్తి తీరనివ్యథతో కృంగిపోతుంది—

గుండ్రని ముఖం...మిలమిల మెరిసే కళ్ళూ ... గిల్లితే పాలుజిమ్మే బుగ్గలూ ... చూస్తూ ఆ దౌర్భాగ్యుడు నీళ్ళు నములుతూ ఊరుకొంటాడా? వంటరిగా స్త్రీ కనుపిస్తే ఎంతటి మగవాడైనా తన తుచ్ఛస్వభావాన్ని చూపించకుండా ఉండడు అందులోనూ రాజారావ్ దగ్గరా! రాజారావ్ లాంటి దుర్మార్గుని దృష్టిలో పడ్డ యే స్త్రీ తన శీలాన్ని గోల్పోకుండా ఇంటికి తిరిగి రాలేదు.

ఇలా ఆలోచిస్తూంటే పదిహేను సంవత్సరాలు క్రితం జరిగిన యేదో బాధాపూరిత సంఘటన ఆమె స్మృతిపథంలో మెదిలింది—

ఆ రోజున థియేటర్‌లో జరిగిన ఒక అమానుష సంఘటనకి తన జీవితాన్ని బలిచేసింది. ఒక కఠినాత్ముని కర్కశ హస్తాలలో చిక్కిపోయి తన జీవితాన్ని సర్వనాశనం చేసుకొంది. ఆ నరరూప రాక్షసుని కర్కశ హస్తాలలో నలిగిన నిదర్శనంగా, పదినెలల అనంతరం తను నీలూకి తల్లి ఐంది. ఆవ్యక్తిని నేటివరకూ ఎక్కడా చూల్లేదు— తొలిరాత్రితోనే తన జీవితరంగం నుండి నిష్క్రమించాడు. క్షణసుఖం కోసం తన జీవితాన్ని చిత్రవధచేసి పిరికిపందలా పారిపోయాడు కళంకరహితమైన ఆదర్శజీవితాన్ని గడిపి నలుగురు స్త్రీల మధ్యా శెభాష్ అనిపించుకొన్న తను

యవ్వనపు తొలిమెట్టులోనే అందరిచేతా వేలెట్టి చూపించుకొంది.

నలుగురు స్త్రీలలా సంసారాల్ని దిద్దుకొంటూ భర్త కనుసన్నలలో గౌరవంగా కాలం గడపవలసిన తన కీరాత పట్టి నందుకు పరితప్త హృదయంతో కుమిలిపోతుంది. ఆవిరైపోయిన తనజీవితం గురించే అనుక్షణం ఆలోచిస్తుంది. కాలుజారినచోటునే ఉండిపోయింది. కల్మషపూరితమైన తన కళ్ళకొలకుల్లో తిరిగే ఆశాపూరితమైన ఆనందబాష్పాలు సృష్టించుకో లేక పోయింది.

తనలాంటి నిర్భాగ్యపువనితలకు జాలిచూపే అందుకు బదులూ, సంఘం తన్నిచూస్తే తాచుపాములా బుసలు కొడుతూ విషం కక్కుతుంది — తననీ, తనబిడ్డనీ చూస్తే ఎందుకో ఈ అక్కసు !!

వంటరి బ్రతుకులు వెళ్లబోసే తనలాంటి నిర్భాగ్యపు వనితలకు రక్షణనీయలేని ఈపాడుప్రభుత్వాన్ని నిందించింది. ఆరోజున ఆమెను చెరచిన దౌర్భాగ్యుడు ఎవరోకాదు—!! ఒకరక్షకశాఖాధికారి ! కాదు ! ఒకనరరూపరాక్షసుడు !! ఒక పూర్ణవిషకుంభం !!! కంచే చేను మెయ్యటానికి వస్తే ఇంక రక్షణ ఎక్కడిదీ ? అనిచెప్పి వాపోయింది. ఆసంఘటన వాని జీవితాని కొక మధుర స్వప్నమే కావచ్చు ... కానీ, తన జీవితాన్ని చిత్రవధచేసిన సుత్తి దెబ్బ! తన జీవిత పురోగమనం మధ్య హఠాత్తుగా పడ్డ చెలియకట్ట—

అర్ధశతాబ్దం గడిచిపోయింది—

నెరసినజుత్తు ... నలిగిపోయిన నవయవ్వనం......
లోపలకు పీక్కుపోయిన కళ్ళు ... బాహ్య ప్రపంచాన్ని చూసేటందుకు ప్రతిక్షణం భయపడుతూనే ఉంటాయ్—

మేఘావృతమైన అనంతాకాశంలో తళుక్కున మెరుపులు... వెనువెంటనే "ధనేల్" మని రాలే పిడుగులు చప్పుడు కి భూతలమంతా కంపిస్తోంది. బైట కుండపోతగా వర్షం కురుస్తోంది. పరిసరప్రాంతంలో ఎక్కడో పెద్ద పిడుగు పడింది—

చెట్లు చేమల్ని పెనువేళ్ళతో పెగలించుకొని పోతోంది సుడిగాలి—

పన్నెండు ఐంది—

తన చిట్టితల్లి ఇంకా రాలేదు—

అబ్బా! ప్రకృతి ఎంత భీభత్సం చేస్తోందీ!

ఈభయంకర ప్రకృతికి జడిసి...జడివానలో ఏ చెట్టు క్రింద నిల్చొందో! ఆమె గుండెలు హఠాత్తుగా ఒక్కసారి ఆగి మళ్ళీకొట్టుకోవటం మొదలు పెట్టాయ్—

— ఆ అమ్మాయ్ తడుస్తూ... తూల్తూ...సోల్తూ... వెళ్ళి ఆ చూరుక్రింద నిల్చొంది. మరుక్షణంలోనే "ధనేల్" మని తలుపులు తెరుచుకొన్నాయ్......

"అమ్మా"!...... అని బావురుమంటూ ఆ వచ్చిన పసిగుండె ముడుతలుపడ్డ దేహాన్ని బాధతో హత్తుకొని వెక్కి-వెక్కి యేడ్వటం మొదలు పెట్టింది.

"దౌర్భాగ్యుడు ఎంత పనిచేశాడమ్మా......!"

వృద్ధహృదయం బాధతో కంపించిపోయింది......

బైట పిడుగుల వర్షం......

పెళపెళమంటూ ఇల్లు ఏదో కూలిపోయింది......

మరుక్షణంలోనే. బాధగా మూల్గే రెండు నిండుజీవాల ఆఖరి శ్వాసలు...!!

ఆ కారుచీకట్ల మధ్య సానుభూతితో సహాయం కోసం అరచే కరుణార్ద్రహృదయుల కన్నీటి కేకలు—

ప్రకృతిమాత గాఢనిట్టూర్పులకు జడిసి ఎవ్వరూ తలుపులు తీసుకొని బైటకు రాలేదు !!!

* * *

నేటికీ......నా లాడ్జి కెదురుగా నున్న కూలిపడిన గోడలూ......విరిగిపడిన కిటికీలూ......పాడైపోయిన పాత గోడలమధ్యనుండి బాహ్యప్రపంచాన్ని చూట్టానికి భయపడుతూనే ఉంటాయ్—

# కర్మ వైరుధ్యం

ఇప్పుడు కర్మదేవత కాళ్ళక్రింద నలిగిపోయిన మా జీవితాలు తల్చుకొని కన్నీరు తుడుచుకొంటూ, సంఘ ఆవరణకు కనుచూపుమేర కనబడే వీరేశలింగంగారి నవీన సమాజపు సంస్కరణలు చదువుతూ శ్యామల హృదయ భారాన్ని తగ్గించుకోనూ లేదు ... నేను సంఘ సంస్కర్తనై ముందడుగు వెయ్యనూ లేను...

ఆరోజు నాకు చాలా బాగా జ్ఞాపకం ! ! !

సాయంకాలం నాల్గుగంటల ప్రాంతంలో వాడి ఎర్ర గుర్రం వీధి చివర కనుపించగానే నా గుండెలు దడదడ లాడాయ్. వాడొక యమభటుడని హెడ్ఆఫీస్‌లో విషాదవార్తలు ఏరుకొచ్చి అక్కడక్క డున్న ఇళ్ళల్లో పడేసి ఆ కుటుంబాల్ని దుఃఖసముద్రంలో ముంచుతాడని నాకు ముందే తెలుసు ! వాడెప్పుడూ శుభవార్తలు తీసు కొచ్చినట్లు కనబడదు. ఎప్పుడూ చావుకబుర్లే మోసు కొస్తాడు. వాడి సైకిల్ ఇల్లు దాటి పోయేవరకూ అందరూ వాణ్ణి యమభటునిలాగే చూస్తారు.

వాడి ఎర్ర గుర్రం నడుస్తూంటే " డేంజర్ సైరన్ " జ్ఞాపకానికి వస్తుంది...

నేను అనుకొన్నట్లుగానే వాడి ఎట్టగుర్రాన్ని మా ఇంటిముందరే నిలబెట్టాడు. ఆ దౌర్భాగ్యుడు ఏ విషాదవార్త మోసుకొస్తాడోఏమో అని తల్లడిల్లిపోయాను. టెలిగ్రాం కవరు చేత్తోపట్టుకొని చటుక్కున ఎదురుగానున్న కరణంగా రింట్లోకి వెళ్ళాడు. రక్షించావ్‌రా భగవంతుడా అను కొన్నాను. కొద్దిగా తేరుకొని కిటికీలోనుండి కరణంగారి ఇంటివైపు చూశాను. కుమారుని మరణంతో మనోవ్యాధి పెట్టుకొని మంచమెక్కిన కరణంగారు ఇంకా ఆరోగ్యాన్ని కోలుకోనేలేదు — మళ్ళా యేంటీ ప్రళయం ! అను కొన్నాను.

కవరు ఆయనచేతిలో పెట్టి సంతకం చేయించుకొని సైకిలెక్కి చల్లగా జారుకున్నాడు.

కరణంగారు ఆత్రుతగా ఆ కవరు అందుకొని చించి, అందులోని టెలిగ్రాంఫారం బైటకుతీసి ... అరంగుళం దళసరిలో నున్న సులోచనాలక్రింద పెట్టుకొని, కళ్ళు పెద్దవి చేసి ఆందోళనగా చదువుకొన్నారు.

ఇంకేముంది...??? అతని గుండెలు శరవేగంలో కొట్టుకొన్నాయ్. ఆశ్చర్యం ... బాధా ... బరువూ విరక్తీ క్షణంలో ముఖమంతటా వ్యక్తమయాయ్.

ఈ మరణవార్త భరించలేను ! అన్నట్లుగా తల బాధగా ఇటూ అటూ ఊపి కొన్ని క్షణాలపాటు ఊపిరి అందనట్లు కుర్చీకి అంటిపెట్టుకొని ఉండిపోయారు. ఆక్షణంలో

ఆయన ఊపిరి పీలుస్తున్నారా, లేదా అనే సందేహంకూడా నా కృలిగింది.

కాకపోతే యేంటీ ...???

పదినెల్లక్రితమే పాతికేళ్ళ కొడుకు పోయాడు. యే జబ్బూ లేదు — ఇంకా రామంమరణం మరపు తెర చాటున మరుగు పడనేలేదు ... యేంటీ విషాదవార్త...?

బాధగా కళ్ళనీళ్ళు తుడుచుకొంటూ కుర్చీలోనుండి లేచారు. తొందర తొందరగా లోపల కదుగు లేస్తూంటే అడుగుల్లో అడుగులు తొట్రుపాటు పడుతున్నాయ్. పైమీద కండువా జారి క్రింద పడింది. అది పడ్డట్లు కూడా ఆయన గమనించలేదు. ఆ విషాదవార్త నలుగురిమధ్యా కూర్చొని తల దువ్వుకొంటూన్న శ్యామలతో ఎలా చెప్పటం...? ఆ గదిలోకి వెళ్ళాలనుకొన్నారు. కానీ వెళ్ళ లేకపోతున్నారు.

గోరుచుట్టుమీద రోకలిపోటులా మళ్ళా అతని కేంటీ కష్టా లనుకొన్నా...

మరుక్షణంలోనే ఇంట్లో అందరూ గొల్లుమన్నారు. ఈడొచ్చిన చిన్న కుమార్తె శ్యామలకి ఘనంగా పెళ్ళి చేశారు. ఇంకా శ్యామల్ని అత్తవారింటికూడా పంపలేదు. పెళ్ళిచేసి సంవత్సరం కూడా పూర్తి కాలేదు. కాలేజీలో చదువుకొంటూ, తినీ, తిరుగుతూ ఏ జబ్బూ జాడ్యం లేని పిడుగులాటి తన అల్లుడికి ఇప్పు డేంటీ అకాలమరణం ?

అరవైయేళ్ళు నిండి కాటికి కాళ్ళు జాచుకొన్న తనింకా జీవచ్ఛవంలా బ్రతకటమేంటి? చెట్టంత కొడుకూ... ఇంటంత అల్లుడూ — పెళ్ళిచేసుకొని కుటుంబాల్ని దిద్దుకోవలసిన వాళ్ళకే ... నూరేళ్ళూ నిండటమేంటి ! అందరి మరణాలూ చూసేటందుకా తనింకా ఈ వృద్ధాప్యంలో బ్రతకటం ! తనుండీ ఇంకా ఎవరిని ఉద్ధరించటానికి ?

తనెవరికీ అన్యాయం చేశాడూ ? తనెవరిసొత్తూ అన్యాక్రాంతం చేసి, అపహరించలేదే ! ఎవరినీ పన్నెత్తు మాటైనా ఆడలేదే ! ! చివరికి దైవాన్నికూడా దూషించలేదే ! తన చివరి రోజుల్లో తనకేంటీ కష్టాలు ! తన కుమార్తె ముద్దు ముచ్చట్లు తీర్చకుండానే నూరేళ్ళూ పూర్తి చేశాడు—

ఇంక తన కుమార్తె శ్యామల బ్రతుకు అథోగతేనా ?

నాల్గు సంవత్సరాల క్రితమే పెద్దఅల్లుడు పోయాడు... పెద్ద కుమార్తె గంపెడు పిల్లలతో తలచెడి ... దిక్కులేక తన ఇంటికి వచ్చింది. ఆమెస్థితి చూస్తే హృదయం బ్రద్దలౌతుంది.

జనన మరణాలు—

సుఖ దుఃఖాలు—

చీకటి వెలుగులు—

అబ్బా ! యేంటీ విచిత్ర సృష్టి ?

యేంటీ ప్రపంచం...?

భగవంతుడు తన్నిప్పుడు పరీక్షిస్తున్నాడా ?
వృద్ధాప్యంలోనా తన కీ అగ్ని పరీక్ష...??

కరణంగారి ఇంటి వైపు జాలిగా చూశాను—అబ్బా ఆహృదయ విదాహకమైన దృశ్యాన్ని ఇంక చూళ్ళేక... తల బాధగా పక్కకు తిప్పు కొన్నాను.

—ఇంటిల్లిపాదీ శ్యామలచుట్టూ చేరి ఆమెను ఓదారుస్తూ ఓదార్చలేక ..ఆమెతోనే కలసి గుండెపగిలేటట్లు యేడుస్తున్నారు.

తల్లి వళ్ళోకి వాలి గొల్లున యేడుస్తోంది శ్యామల—
"కాఫీ తీసుకో అన్నయ్యా !" అంది శారద.
చటుక్కున పక్కకు తిరిగి చూశాను—

శారద కాఫీ కప్పుతో టేబుల్ ప్రక్క ఎంతసేపు నుండి నిల్చొని ఉందో నేను గమనించనే లేదు—తలెత్తి శారద ముఖంలోకి చూశాను. శారద ముఖమంతటా విషాద ముద్ర ఆవరించుకొని ఉంది. సుదీర్ఘమైన ఆచూపుల్లో అవ్యక్తమైన అశాంతేదో ఆవరించుకొని ఉంది.

"శ్యామల భర్త ప్రకాశరావ్ రాత్రి పదిగంటల ప్రాంతంలో సినీమా చూస్తూ హఠాత్తుగా హార్టు ఆగి చని పోయాట్ట అన్నయ్యా" బావురుమంది శారద.

శారద స్థితి చూస్తే నాకు షాక్ తగిలినట్లైంది.
"ఏంచేస్తాం శారదా !... అంతా దైవనిర్ణయం !"

పాపం! పెళ్ళై ఇంకా సంవత్సరం కూడా పూర్తికాలేదు."
అంటూ జాలిగా సానుభూతి తెల్పాను.

ఐనా శ్యామలదీ, శారదదీ ఈరోజు స్నేహమా!

చిన్నప్పటినుండీ ఒకర్నివిడిచి ఒకరుండలేని అపూర్వ స్నేహం వాళ్ళది. నిరు డీ రోజులవరకూ ఇద్దరూ కలసి స్కూల్లో చదువుకొంటూ ఉండేవారు. చిన్నప్పటినుండీ వా ళ్ళెంత స్నేహంగా ఉంటూ ఉండేవారో శ్యామలకు పెళ్ళి ఐన తరువాత కూడా అంత స్నేహంగానే ఉంటు న్నారు. వీళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళై అత్తవారిళ్ళకు వెళ్ళిపోతే అప్పుడు ఒకర్ని విడిచి మరొకరు ఎలా ఉండగలరూ! అనుకొనేవాణ్ణి.

శ్యామలపెళ్ళి అవుతూంటే శారద ఎంతగా మురిసి పోయిందో నేను చెప్పలేను. స్నేహితుల ఆహ్వానాలూ, పెళ్ళివారి సన్మానాలూ అన్నీ కూడా చిరునవ్వుతో తన చేతిమీదే జరిపించింది. అప్పటికి రామం కూడా బ్రతికే ఉన్నాడు! ఆ పెళ్ళి హడావిడికీ ఆనందానికీ వీ ళ్ళిద్దరే కాబోలు భాగస్వాములు అనుకొన్నాను నేను. వాళ్ళ అన్యోన్యతా, అనురాగం చూసి భవిష్యత్‌లో కూడా వా ళ్ళెందుకు భాగస్వాములు కాకూడదూ అనిపించింది అందరికీ —

శలవలకు స్వగ్రామం వచ్చినప్పుడల్లా నేనూ,

శ్యామలా ... శారదా, రామం ఎంత అన్యోన్యంగా ఉండే వారమో ఊళ్ళో అందరికీ తెలుసు :—

రామం నాతోపాటు లయోలాకాలేజీలో బి. ఎ. ప్యాసయాడు. అతను కాలేజీ మొత్తంమీద జీనియస్. ఫస్టు క్లాసులో, ఫస్టురేంక్‌లో ప్యాసయాడు. స్థితిగతులు బాగు లేకపోవటంచేత, చదువుకి స్వస్తిచెప్పి చక్కని ఉద్యోగంలో ప్రవేశించాడు. చూద్దామన్నా అతనిలో ఒక్క దుర్వ్యసనం కనిపించేదికాదు. ముక్కూ, ముఖం, తీరూ చూస్తే ఎదుటి వ్యక్తిని అతనికళ్ళు సూదంటురాయిలా ఆకర్షించుకొనేవి.

ఎటువంటి చుట్టరికాలూ లేకపోయినప్పటికీ, ఎదు రిళ్ళల్లో ఉన్న మా రెండు కుటుంబాలమధ్యా ఎటువంటి అరమరికలూ లేవ్ ! మా పెద్దల దగ్గరనుండీ వస్తూన్న స్నేహాభిమానం మది !— మా నాన్న బ్రతికున్న రోజుల్లో మా రెండు కుటుంబాలూ ఒకింట్లోనే ఉండేవి. మా నాన్న చనిపోయిన రోజున కరణంగారు ఒక పసిపిల్లవానిలా ఏడ్చారు. ఆ రోజున నన్నూ, శారదనూ హృదయానికి హత్తుకొని సానుభూతితో ఓదార్చారు. కరణంగారంటే మానాన్నకి ప్రాణం ! ! !

కరణంగారు నిజంగా కరణీకం చెయ్యలేదు. వాళ్ళ పూర్వులదగ్గరనుండీ ఆ కరణీకం వంశ పారంపర్యంగా ఆయన తాత తండ్రులవరకూ వచ్చింది. కానీ ఈయన మాత్రం చక్కగా చదువుకొని, ప్రభుత్వోద్యోగులై, ఇంత

సంపాదించుకొన్నారు. ఇప్పుడు లాగలేని కుటుంబ భారం లాగటంచేత ఆర్థిక శక్తి చాలవరకు అంతరించి పోయింది. హరించిపోగా మిగిలిన ఆస్థితో ఇప్పటివరకూ చాలా గౌరవంగానే బ్రతుకుతున్నారు. వంశానుసరణిగా వస్తూన్న కరిణీకం చేత పిన్నలూ, పెద్దలూ అందరూ ఆయన్ని కరణంగారు అనే పిలుస్తారు. ఆయన అలాగే పలుకుతారు. ఆ పేరు ఆయనకి సార్థకనామంగానే నిల్చిపోయింది. ఆయన పూర్తి పేరు "రామ్మూర్తి"గారు అని ఊళ్ళో చాలామందికి తెలీదు. మా నాన్న మాత్రం ఆయన్ని రామ్మూర్తి అనే పిల్చేవారు. కుటుంబంలోని చివరి సంతతి వరకూ ఆ పేరు సార్థకనామంగానే నిల్చిపోయింది. రామాన్ని కూడా పాటకజనం అప్పుడప్పుడు కరణంగారు అనే పిల్చేవారు. మా నాన్నకీ ఆయనకీ ఉండే సంబంధం రక్తస్పర్శ కాక పోయినప్పటికీ ఒకరికి కష్టమొస్తే మరొకరు తామరాకులో నీటిబొట్టులా తల్లడిల్లిపోయేవారు. చిన్నప్పుడు వాళ్ళిద్దరూ ఒకే బడిలో చదువుకొని, ఒకే యూనివర్సిటీలో పట్టభద్రులై, ఒకే ఆఫీస్‌లో ఉద్యోగంచేసి, ఒకే సంవత్సరంలో రిటైరై, ఒకే ఊళ్ళో స్థిరపడిపోయారు. వాళ్ళ స్నేహం చిన్నప్పటినుండీ చాలా విచిత్రమైందీ ... అపూర్వమైందీ కూడాను....

వాళ్ళ స్నేహచిహ్నం చిరస్థాయిగా ఈ రెండు కుటుంబాల మధ్యా వియ్యరూపంలో నెలకొల్పేందుకు

వివాహితులైన రెండు సంవత్సరాలకే ఆదర్శభావాలతో పునాదులు వేసుకొన్నారు. కర్మవశాత్తూ వాళ్ళిద్దరూ, మేం నలుగురం ఒకదగ్గర కూర్చోటం తటస్థించినప్పుడు యేవో వేళాకోళాలు ఆడేవారు. మాకు చచ్చినంతపనయ్యేది. సిగ్గుతో కృంగిపోతూ శ్యామలదగ్గరనుండి నేనూ, శారద దగ్గరనుండి రామం లేచి దూరంగా పారిపోయే వాళ్ళం... వాళ్ళ ఆదర్శాలు ఆధారంగా తీసుకొని బాల్యంలో ఊహించుకొన్న ఊహలు యవ్వనంలో బలపరచాం—

మా నలుగురి భవిష్యత్ జీవిత నిర్మాణానికీ పునాదు లేస్తూంటే అకస్మాత్తుగా మానాన్న మరణం!! ఐనప్పటికీ వాళ్ళు వేసుకొన్న పునాదులు వెంటనే కూలి పోలేదు... మా నలుగురి అన్యోన్యానురాగమే తొలి మా నవజీవిత నిర్మాణానికి వేసిన శంఖు స్థాపనని కాంక్రీట్‌తో బల పరచాయ్.

ఒకింటివాడై కుటుంబాన్ని సాకవలసిన రామం మరణంతో మా ఆశా ఆదర్శాలమధ్య భరించరాని డిస్ ఎపోయింట్‌మెంట్...! దాంతో కరణంగారు చాలావరకూ కృంగిపోయారు. చాలాకాలం వరకూ రామం మరణాన్ని మనసారా మర్చిపోలేకపోయారు. నేటికీ రామం హఠాత్తు మరణం అతని గుండెల్లో మానని గాయంగానే నిల్చి పోయింది.

భార్య నిర్బంధంచేసి శ్యామలకు దగ్గర బంధువులతో పెళ్ళి నిశ్చయం చేసేసింది. భార్యని ... ఎదిరించే ధైర్యం అతనికి లేదు...

ఇప్పుడు,

తన జీవనావ నడిసముద్రంలో పగిలి తనని సుడిగుండం లోకి నెట్టేస్తుందని శ్యామలమాత్రం ఊహించలేదు.

శ్యామలపెళ్ళి తనబావమరదికొడుకు ప్రకాశరావ్‌తో అవుతుందని,కరణంగారు మాత్రం ఊహించుకొన్నారా...? శ్యామల నా కోడలు కాకుండా పోతుందని నే నెన్నడైనా ఊహించుకొన్నానా ... ? రామం అకాలమరణానికి గురి అవుతాడని నా చెల్లెలు శారద కలలోనైనా ఊహించిందా ?

అంతా విధివిలాసం...!

విధి బలీయమైంది...!!

కర్మ నిర్ణయించిన జీవితాలు కాలప్రవాహంలోపడి తమ నిర్ణీత గమ్యస్థానాలు చేరుకొనే వరకూ కర్మదేవతకు తృప్తి లేదు. అదంతా విధి నిర్ణయం!!!

మా నాన్న యెదుట చేసిన ప్రమాణాల్ని ఉల్లం ఘించి మా రక్త కన్నీటితో పునః నిర్మాణం చేసేటందుకు కరణంగారు ఎంతగా బాధ పడ్డారో నే నిప్పుడు మీతో చెప్పలేను. శ్యామలకు మంగళసూత్రధారణ జరుగుతూన్న ప్పుడు మా ముగ్గురి బాధా యే మానవ హృదయం కూడా అర్థం చేసుకో లేదు____

ఆ రోజున ఆయన తన దగ్గరకు పిలచి జాలిగా నా కన్నీరు ఒత్తుతూ...

"సూర్యం ... నీకెంతో అన్యాయం జరిగింది!... విచారించకు నాయనా! ... అంతా కర్మనిర్ణయం!!!" అంటూ శిథిలమైన నా అర్థహృదయంమీద జాలితో సానుభూతి తెల్పారు.

భార్య చేతిలో కీలుబొమ్మ అయిపోయినందుకు నా మనస్సులో మంట రగుల్తోన్నా, అతనిమీదుండే పూజ్యభావమే నన్ను అతని ముందొక మూగవానిగా చేసింది...

భర్త పవిత్ర ఆశయాన్ని పెడచెవిని పెట్టి యెలాగో తన ఆశయసిద్ధి పొంది, కుమార్తె జీవితపథాల్ని చీలిక చేసేశానని ఆ యిల్లాలు ఇప్పుడెంతగానో ఖేద పడుతుంది. ఏం ప్రయోజనం?

ఇప్పుడు మా భగ్నహృదయాలు ఒక దగ్గర చేరి ఒకరిమీదొకరు సానుభూతి చూపుకొంటూ కన్నీళ్ళు తుడుచుకొంటూంటే, మమ్మల్ని ఆ ఆలుమగలు చూసి ... ఒకరిముఖాల్లోకొకరు చూసుకొంటూ బాధా బరువులతో కృంగిపోతారు.

"వాడే నీ అల్లుడు!..."

"నేనే నీ కోడల్ని!..."

"బావా! నువ్వే నా మొగుడివి...!" అనే మాటలు మన నిత్యజీవితంలో ప్రతి యింటా అప్పుడప్పుడు వినిపిస్తూనే

ఉంటాయ్ ! విన్నప్పుడల్లా మనలో మనం నవ్వుకొంటూనే ఉంటాం …అజ్ఞానంలోనూ … అమాయకత్వంలోనూ … అనుకొనే యీ మాటలు శ్రోతలకు శ్రవణానందంగా వినిపించినా … అవిప్పుడుమాత్రం నాకు కర్ణకఠోరంగానే వినిపిస్తాయ్—

బాల్యంలో ఊహించుకొన్న యీ ఊహలు యవ్వనంలో ఒక ఆకారం కోసం ప్రాకులాడతాయ్. "భవిష్యత్ సంశయాంధసంవృతం"—

వాళ్ళ ఉద్దేశాలకు విరుద్ధంగా కర్మవైరుధ్యం కఠినంగా పనిచేసి వాళ్ళ జీవితాలను చీకటి లోయల్లోకి ఎందుకు నెట్టెయ్య కూడదూ . . .??

చితికిపోయిన మా ఇరువురి జీవితాలే కాదు—రాము ఆకస్మిక మరణం తల్చుకొంటే నా చెల్లెలు శారద. హృదయం పగిలేటట్లు ఏడుస్తుంది . . .!!

శిథిలమైపోయిన తన జీర్ణ హృదయంమీద పూల మొక్కలు నాటినా అవి ముళ్ళపొదలుగానే మారిపోతా యుంటుంది యిప్పుడా భగ్న హృదయం !!

కర్మపరిణామం ఆలోచించకుండా ఒక పవిత్ర ఆశయం ఆధారంగా తీసుకొని . . . ఊహ తెలియని వయస్సుతో జీవితభాగస్వాముల్ని నిర్ణయించడం కేవలంఇప్పుడు నాకు తెలివితక్కువగానే కనిపిస్తూంది—

సఫలమైనప్పుడు వాటి విలువలు మహోన్నతాశయాల్లా ప్రకాశించి ఆరని "ఆదర్శ" జ్యోతులై చిరస్థాయిగా నిత్యజ్యోతుల్లా వెల్గుతాయ్ ! ఆ వెల్గు నీడల్లో ఆ మూడు అక్షరాలూ మహాకాంతివంతంగా ప్రతి హృదయంలోనూ ప్రతిఫలిస్తాయ్. విఫలమైనప్పుడు కర్మదేవతే దానంతటికీ కారణమంటూ ఆ అమాయకురాల్ని వేలెట్టి చూపించి మనమొక నిర్దోషుల్లా బైటకు తప్పుకొంటాం—

బాధ్యతతో నిర్ణయించిన మనం దానికి భాగస్వాములం కామా . . . ???

చిత్రవధ జరిగిన మా జీవితాలమీద ఇప్పుడు అమృతాన్ని కురిపించినా అవి మాకు కన్నీళ్ళుగానే కనిపిస్తాయ్—

# నిరీక్షణ

—०ः०ः०—

[ఇంక ఆ ఉత్తరం రాదు!!! నిస్పృహ భరిస్తూ ఎంతకాలమీ ప్రతీక్ష....?" తన దహనసమయంలోనైనా తనకా ఉత్తరం లభిస్తుందా? తను బ్రతి కుండగా తన కా ఉత్తరం చేరదు కాబోలు...

"ఎప్పుడో నేను చచ్చిన తర్వాత నా సమాధి మీదికి ఆ ఉత్తరం వస్తుంది—"]

ఇంక చదవండి—

శూన్యంలోకి చూస్తూ, దీర్ఘాలోచనలోపడి ఉన్న తులసీదేవి గోడగడియారం ఠంగ్-ఠంగ్ మంటూ నాల్గు కొట్టేసరి కల్లా ఆతృతగా కుర్చీలోనుండి లేచింది.

చరచరా వీధిగుమ్మంలోకి నడచివెళ్ళి తదేకదీక్షతో స్తంభాని కానుకొని, దృష్టిని వీధి చివరకు మార్చి...... ఎవరికోరకో ఎదురు చూస్తుంది. ఒక వారం రోజులనుండి ఆమె ఆవిధంగానే సాయంత్రసమయంలో నిరీక్షిస్తోంది. కాని ఆవ్యక్తి యిప్పటివరకూ రాలేదు. ఇంకా ఎంత సేపటికి వస్తాడో...? అసలు రాడు కాబోలు!!

వస్తాడు...! తప్పక వస్తాడు...!! ప్రపంచమంతా ప్రళయం పెట్టినా అత నా వీధికి రాకుండా మానడు...!!! ఇవాళ ఒట్టి చేతులతోరాడు—ఏదో సందేశం తీసుకువచ్చి చిరునవ్వుతో తనచేతిలో పెడతాడు. తనిప్పుకుంటుంది— చదువుకొంటుంది—తనలో తనే నవ్వుకొంటుంది. ఆశుభ

వార్త అందరికీ చెప్పి, అందరికీ అమృతం త్రాగించి ఆనంద పరుస్తుంది.

అరగంట గడచింది—

"ఇంకా అతను రాలేదు"—

అతని రాకకోసం యింత ఆత్రుత ఎందుకూ ?

అతను తెచ్చే సందేశం అంత అమూల్యమైందా?

తనలాటి వందలాది బాధాహృదయాలకు ఉత్తరా లిచ్చి అతను తాత్కాలికమైన ఉపశాంతి చేస్తాడు. తప్త హృదయాలపై అత నిచ్చిన సందేశాలు అమృతాన్ని వర్షి స్తాయి. కూలిపోయిన ఆశల్ని కూడదీస్తాయ్— అదృశ్యమై పోయిన ఆశాకిరణాలకు ఒక ఆకారాన్ని కల్పిస్తాయ్.

ఆ వార్తావాహకుడ్ని వీధిలో చూస్తే అందరూ అతణ్ణి చూసి నిష్కల్మషమైన చిరునవ్వు నవ్వుతారు. నిష్కల్మషమైనచిరునవ్వుని యీ ప్రపంచంలో అత నొక్కడే పొందుతాడు. అతని నిస్వార్థసేవే అందుకు మూలం. ఆ గ్రామానికి వస్తే అందరూ అతణ్ణి ఆప్తహృదయునిలా ఆద రిస్తారు. అతను ఒక క్షణం రావటం ఆలస్యం అయితే అతను వచ్చేవరకూ యెదురుతోవలు చూస్తూ గుమ్మంలో నిల్చొంటారు.

తులసీదేవి మరొకసారి వీధిచివరకి తొంగిచూసింది. ఆవ్యక్తిని అన్వేషించినట్లు రివ్వున ఒకచిరునవ్వువచ్చి ఆమె పెదవిలమీద వాలింది.

సైకిలుకు స్టాండువేసి, ఉత్తరాలకట్ట చేత్తో పట్టుకొని అప్పుడే పోస్టుమేన్ పున్నయ్య పక్కింట్లోకి వెళ్ళాడు. రెండు నిమిషాలు అయింది. ఉత్తరం యిచ్చి రావడానికి అంత ఆలస్యం ఎందుకూ...? వేగం రాలేదూ...? ఆ ఉత్తరం కోసం వీధిలో నిల్చొని ఎదురు చూస్తోందని అతని కెందుకు తెలీదూ...?

నిమిషాలు లెక్కపెడుతూంది. అతను త్వరగా వచ్చే సూచన లేవీ కనబడలేదు. ఆ ఉత్తరంతోనే తన భవిష్యత్ జీవిత నిర్మాణం జరుగుతుంది—అప్పుడే తన జీవితానికి శాశ్వతశాంతి చేకూరుతుంది. సైకిలు కదలినచప్పుడైంది. మరుక్షణంలోనే పోస్టుమేన్ పున్నయ్య గుమ్మంలో నుండి పోతూ ఆమెవైపు చూశాడు. "నాకేమైనా ఉత్తరాలు వచ్చాయా పున్నయ్యా?" ఆత్రుతగా ఒక మెట్టు క్రిందకి దిగి ఆశగా అతని కళ్ళలోకి చూస్తూ అడిగింది.

"రా – లే – ద – మ్మా" అంటూ జాలిగా సమాధానం చెప్పి ఆ వృద్ధుడు ముందుకు కదలిపోయేడు.

నాల్గువారాలనుండి యీనాల్గు అక్షరాలే ఆమెకు కర్ణకఠోరంగా వినిపిస్తున్నాయ్. ఎంత డిస్ఎపాయింట్మెంటు!!! నిస్పృహాభరిస్తూ ఎంతకాల మీ ప్రతీక్ష? ఇంక ఆమె భరించ లేదు. మనస్సులో నిరాశ కారుచిచ్చులా రగిలి నకసికపర్యంతం దహించివేస్తోంది. తన దహనసమయంలోనైనా తన కా ఉత్తరం లభిస్తుందా? తను బ్రతికుండగా యింక తనకా

ఉత్తరం చేరదుకాబోలు !!! కళ్ళల్లో ప్రాణాలు నిల్పుకొని చిక్కిన శల్యాన్ని చూసుకొంటూ భారంగా ఒక వేడి నిట్టూర్పు విడిచింది. బరువుగా తల పట్టుకొని తప్పటడుగులు వేసుకుంటూ తన గదిలోకి వెళ్ళి పరుపుమీద కూలి పోయింది.

ఆహృదయ విదారకమైన దృశ్యాన్ని ఒకసారి కన్నెత్తి చూస్తే మనస్సు నీరైపోతుంది ... హృదయం వికలమై పోతుంది ... ఆబాధాకరదృశ్యాన్ని ఏ కవీ వర్ణించలేడు...

తులసిని చూసి తల్లి ఆందోళనతో అలమిటిస్తోంది. సంతానం కుమిలి కృశించి సగమైపోతూంటే మాతృదేవికి క్షోభ కాదూ ? ఆ మాతృమూర్తి ఎంతగా తల్లడిల్లి పోతూందో ఎవరికి తెలుసూ!

ఎప్పుడు చూసినా నా తులసి నవ్వుతూ, కేరుతూ ఎంతో విలాసంగా రోజులు గడిపేది. వెన్నెల విరిసినట్లుండే ఆమె ముఖంలో యిప్పుడు మచ్చుకైనా ఒక చిరునవ్వు కన బడదు. ఆచిరునవ్వుని ముఖంలో ఏ మూరుమూల సమాధి చేసుకొందో తెలీదు ! ఆచూపుల్లో జీవితాశ ఉన్నట్లే కన బడదు ! బాధా — బరువూ — వేదన . . .

బాధగా రాలే కన్నీళ్ళు బరువుగా తలగడతో ఒత్తుకుంటోంది.

కనుచూపుమేర కనబడే మహోన్నతమైన పర్వత శిఖరాలవైపు రాత్రింబవళ్ళు చూస్తూ యేదో ఆలోచిస్తూ

ఉంటుంది — తన హృదయాకాశంలో విచార మేఘాలు దట్టంగా అలముకొని నిరంతరమూ అశ్రుధారలు వర్షిస్తున్నాయ్. అందులో తన మనశ్శాంతి పడి ఏ చీకటి లోయల్లోకో కొట్టుకొని పోతూంది.

తులసి పదిరోజులనుండి భోజనం చెయ్యలేదు. కుమార్తె స్థితిచూస్తూంటే తల్లీ, తండ్రి బాధతో తల్లడిల్లి పోతున్నారు.

"నీవంట్లో బాధేమో చెప్పమ్మా ... డాక్టర్ని పిలచి మందిప్పిస్తాను ... లే ... రోజుకి రోజూ చిక్కి శల్యమైపోతున్నావ్ ... నామాట విను ... లే ... లేచి ఎంగిలిపడి పో ..." అంటూ పితృమూర్తి బ్రతిమాలుతున్నారు.

ఏంచెప్పేది ? అన్నట్లు ప్రక్కనేఉన్న తల్లి కళ్లల్లోకి నిర్జీవమైన చూపులు చూసింది.

చెప్పు తల్లీ ... సందేహమెందుకు ... ? నేను నీ అమ్మనుగానూ ... చెప్పమ్మా ! తల్లికి చెప్పకపోతే నీ బాధ యింకెవరికి చెప్పుకుంటావు ?" హృదయం ద్రవించేటట్లు అడుగుతూంది మాతృదేవి.

" అమ్మా !" అంటూ బాధగా మూల్గి పక్కకు వత్తిగిల్లింది తులసి—

" తిని తిరుగుతూ హాయిగా రోజులు గడపవలసిన నీ కెందుకమ్మా యీ దిగులు ? "

తులసి కళ్ళనుండి కన్నీళ్ళు జలజలా రాలుతున్నాయ్.
"ఏ బాధో చెప్పమ్మా ..." తల నిమురుతూ అడిగింది.
"నన్ను నమ్మ్మ్ ... నా కేజబ్బూ లేదమ్మా" అంది తల్లి కళ్ళలోకి చూస్తూ.

తన కేంజబ్బని చెబుతుంది? తనవంట్లో ఏంజబ్బునాన్న దని? శరీరకంగా తన కేం జబ్బులూ లేవు. మానసికమైన ఆందోళనే ఆమె రక్తాన్ని పీల్చి, పిప్పిచేసి, ఆమెని జీవచ్ఛవంలా తయారుచేసింది. చివరకు తన మనోవేదన, తన అంత్యక్రియలు చూసేవరకు పోదుకాబోలు!

ఐదు నిమిషాలు గడిచాయ్. ఆమె ముఖం గోడ వైపుకి తిప్పేసుకొంది. నిరుత్సాహంగా మేడమెట్లు దిగి కిందికి వెళ్ళిపోయారు తల్లితండ్రులు.

సంక్రాంతికి విశాఖపట్నంనుండి వచ్చిన అక్కా, బావా, భోజనం చెయ్యమని బ్రతిమాలేరు.

"చిన్న అమ్మాయ్ ఇవాళకూడా భోజనం చెయ్యలేదా? అంటూ అర్థాకలితోనే తండ్రి సోమసుందరంగారు విస్తరిముందునుండి లేచి వెళ్ళిపోయారు. నిద్రపోతూన్న తులసిముఖం చూసి, శల్యమైన శరీరాన్నిచూసి చెప్పలేని బాధతో ఆఫీసుఫైల్సు తీసుకొని హాలులోకి వెళ్ళిపోయారు.

"చెల్లీ ... మొన్నిక్కడికి వచ్చినప్పుడు మీ బావ యేమైనా అన్నారా? ఏమన్నారో చెప్పు."

"నన్నెవరూ యేమీ అనలేదు అక్కయ్యా" అంది తులసి తలగడలో ముఖం పెట్టుకుంటూ.

"అయితే నీ ఆరోగ్యం బాగులేదేమి ?"

"బాగానే ఉంది అక్కయ్యా" విరక్తిగా అంది.

"అయితే ఎందుకిలా ఉన్నావ్"... ?

తులసి మాట్లాడలేదు. "ఆ ప్రశ్నమాత్రం అడక్కక్కయ్యా" అన్నట్లుగా కనబడుతున్నాయి ! ఆమెచూపులు.

మరొకవారం రోజులు గడచాయి. తులసి ప్రవర్తన అందరికి చాల బాధ కలిగిస్తోంది.

"చెల్లీ మీ బావ నీ కెంత చక్కని చీర తెచ్చారో చూశావా ?" అంది — గులాబిరంగులో ఉన్న చక్కని సిల్కుచీరె ఆమెపక్కని పడేసి . . .

ఆ మాటలకు తులసి మనస్తత్వం ఏమాత్రం చలించలేదు. కనీసం దృష్టికూడా అటువైపు మరల్చలేదు.

"పాపకు రేపు పుట్టినరోజు పండగ . . . లే తులసీ . . . లేచి ఆ చీర కట్టుకో, పిలుపులకు వెళ్దాం" అంది శారద.

"నువ్వెళ్ళక్కయ్యా" అంది తులసి నిర్లిప్తంగా.

"నువ్వూ రా చెల్లీ . . ."

"క్షమించు అక్కయ్యా. ఇప్పుడు నన్నేమీ కంపెల్ చెయ్యకు. నా మన స్సేమీ బాగులేదు" అంది గోడవైపు ముఖం త్రిప్పుకొని.

"నాకోసం నువ్వెళ్ళటం మానొద్దు — నువ్వెళ్ళు అక్కయ్యా" ప్రతిమాలుతున్నట్లు ధ్వనించింది ఆమె కంఠం.

"రా చెల్లీ!" అంటూనే శారద చెల్లెలు రెక్క పట్టుకొని మెల్లగా లేవనెత్తింది

"అబ్బా! రాలేనక్కయ్యా". అంది లేచి కూర్చుంటూ.

యీ మాట శారదతో చాల ప్రాధేయ పూర్వకంగా అంది.

"అంతేనా" కోపంగా ధ్వనించింది శారద కంఠం.

క్షమించమన్నట్లున్నాయ్ తులసి చూపులు.

"చెల్లీ ... ఈ వయస్సులో నీకెందుకమ్మా యీ దిగులు ?" ... లాలనగా అడిగింది.

తులసి సమాధానం చెప్పలేదు. జవాబుగా కిటికిలో నుండి దూరంగా కనబడే కొండ శిఖరాలవైపు చూస్తుంది.

"నేనొక ప్రశ్న అడుగుతాను ... నువ్వు యదార్థం దాచకుండా సమాధానం చెబుతావా ... ? అంది శారద తులసి చెక్కిళ్ళు పట్టుకొని. అలాగే అన్నట్లు తులసి తల ఊపింది.

క్రిందటి రాత్రి శారద తులసిగదిలో టేబిలుమీద నున్న ఒక పుస్తకం తీసింది. అదొక యింగ్లీషు నవల. ఇప్పి చూస్తూంటే అందులోనుండి ఒక చిన్నఫోటో క్రిందపడింది

పుస్తకంమీద శేఖర్ బి. యే. అని రాసిఉంది. కవరు పేజీ త్రిప్పి చూసింది. " Presented to Sekhar on the occation of his Birth day " — తులసీదేవి —. అని ఉంది. బహుశా తులసి తన క్లాస్‌మేట్ శేఖర్‌కి ప్రజెంటు చెయ్యబోయే పుస్తకమని మాత్రం తెలుసుకుంది.

" అయితే ఆ పుస్తకంలో తన ఫోటో ఎందుకు ?"

రిమ్‌లెస్ స్పెట్సు ... నల్లని టై .... తెల్లని ట్వీల్ లాల్చీ ... పెద్ద కళ్ళు ... ఆకర్షణీయమైన ముఖం ... చూట్టానికి అతను చాల అందంగానే ఉన్నాడు. తులసి శేఖర్‌ని ఎందుకు ప్రేమించకూడదు ?

" తులసీ ... పేపర్సు సరిగ్గా ఆన్సర్ చేశావా ? అడిగింది శారద.

" చేశాను అక్కయ్యా " అంది తులసి.

" క్లాసు వస్తుందా ? "

" రావచ్చు "

" అతనికీ క్లాసు వస్తుందా ... ?" అంది చిలిపిగా.

" వస్తుంది." అంది చటుక్కున తులసి.

ఆ సమాధానానికి నవ్వుకుంది శారద. "నువ్వంటే అతనికి చాల యిష్టం కదూ?" ప్రశ్నించింది శారద.

తులసి సిగ్గుతో తల దించుకొంది.

"నువ్వతణ్ణి ప్రేమిస్తున్నావు కదూ ?" మాటిగా అడిగింది.

"ఛీ అక్కయ్యా! ఏంటీ మాటలు!" విసుగ్గా సమాధానము వచ్చింది.

"నువ్వతణ్ణి ప్రేమిస్తున్నావు కదూ?" మరొకసారి అదోలా చూస్తూ అంది.

"అక్కయ్యా" పిచ్చిదానిలా అరచింది తులసి.

"నాతో చెప్పు ... అతణ్ణి పెళ్ళి చేసుకుందామని అనుకుంటున్నావు కదూ... ..."

శారదమీద పట్టలేని కోపం తులసికి వచ్చింది. అక్కడనుంచి లేచి కిటికీ దగ్గరకు వెళ్ళిపోయింది తులసి.

"నే నెవ్వరితోనూ చెప్పను చెల్లీ! అత నెవరో చెప్పు." ప్రాధేయపూర్వకంగా అడిగింది. ఆ మాట లేమీ వినిపించుకోకుండానే వెళ్ళిపోయింది తులసి. ఇక ఆమె బుర్ర అధికంగా వేడెక్కించడం యిష్టం లేక మేడమెట్లు దిగి క్రిందకి వెళ్ళిపోయింది శారద.

శారద సంక్రాంతికి వచ్చినప్పుడల్లా తులసి ఎంతో సంతోషంతో కబుర్లు చెబుతూ, పాపని ఆడిస్తూ ఎన్నో రోజులు ఆనందంగా గడిపేది. పండుగ నాల్గురోజులూ అక్కా, బావా, తనూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ, కేరింతలు కొడుతూ మేడమీద కూర్చొని గంటల తరబడి చదరంగం ఆడేవారు. వాళ్ళతో కలసి సినిమాలకు, నాటకాలకు, షైర్లకు తెగతిరిగేది. రంగురంగుల చీరెలు కట్టుకొని సంతోషంతో లోలోపలే మురిసిపోయేది. గడిచిన

సంక్రాంతి ఎంత ఆనందంగా గడిపారో జ్ఞాపకం చేసుకుంటే ఆసంఘటనలన్నీ కళ్ళకు కట్టినట్లు కనబడ్డాయి. మరుక్షణం లోనే ఎందుకో ఆమె కళ్ళు కూడా చెమ్మగిల్లాయి.

తన కేం జబ్బుందని ? తన కెందుకీ మందులూ...? డాక్టర్ల ఖజానాలు నింపడానికా—? నా కేమీ జబ్బులేదు. ఆ డాక్టరు ఉన్నాడంటాడేంటి ? తనా చేదుమందులు తాగ లేక చస్తూంది. డాక్టరిచ్చిన మందులు విధిలేక తాగుతోంది. అతని దగ్గరనుంచి ఉత్తరం వచ్చేవరకూ తన పరిస్థితి అలాగే ఉంటుంది.

తులసి ఒక ఉత్తరం కోసం ఎదురు చూస్తూన్నట్లు అందరికీ తెలుసు ! ఎక్కడ నుండి వస్తుందో ఎవరికి తెలీదు.

డాక్టర్ ఒకరోజున నిద్రపట్టేందుకు మందిచ్చి వెళ్ళి పోయారు. ఆరోజున తులసి పడకకుర్చీలో పండుకొని ఉంది.

నాల్గుగంట లైంది ——

ఆమె ఆత్రుతగా వీధిలోకి వెళ్ళింది. పోస్టుమేన్ ఒక నీలి కవరు చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు. దాన్ని చిరు నవ్వుతో అందుకొని చదువుకొంది. ఆనందంతో అందరికీ చూపించింది. అందరూ ముచ్చటతో మురిసి పోయారు. రేపే వస్తున్నానని చెప్పి ఆ అబ్బాయి ఉత్తరం ముగిం చేసేడు. ఆరోజున నిజంగా తన కెంత ఆనందం ! తన ప్రియుడు తన్ని వెతుక్కుంటూ వచ్చాడు ఉదయాన్నే. టాక్సీలో నుండి దిగుతూ ఉంటే ముచ్చటతో మురిసి

పోయింది. చిరునవ్వుతో లోనికి ఆహ్వానించింది. తను రాకుండా చాలా రోజులు, ఆలస్యం చేసి, కనీసం ఉత్తర మైనా రాయకుండా నిరుత్సాహపరచినందుకుగాను ఎన్నో క్షమాపణలు చెప్పుకొన్నాడు. తన్ని ఎన్నోసార్లు ఓదార్చాడు...కళ్ళ నీళ్ళు తుడిచాడు... వెయ్యి విధాల తనకు నచ్చచెప్పి ఉపశాంతి కలిగించేడు. "ఇంక నీ వియోగం భరించలేను తులసీ" అంటూ చిరునవ్వుతో తన బుగ్గల మీద చేతులు వేసి తల దగ్గరకు లాక్కొని ఎర్రని పెద మిలతో గట్టిగా ఒక ముద్దు పెట్టుకున్నాడు తన చెంపమీద. "శేఖర్ ... " అంటూ తులసి కోపంగా పెద్ద గావుకేక పెట్టి పండుకొన్న కుర్చీలోనుండి కోపంగా లేచి నిల్చొని చుట్టూ పిచ్చిదానిలా కలయ జూసింది.

"ఏం తల్లీ అలా లేచావ్ ... భయంవేసి జడుసు కొన్నావా? దగ్గరనే కూర్చున్న తల్లి ఆందోళనగా కుమార్తె స్థితి చూస్తూ అడిగింది.

"అమ్మా! ఉత్తరం వచ్చిందా" ఆత్రుతతో అడిగింది.

"లేదమ్మా" బాధగా సమాధానం చెప్పింది.

"అంతా కల" అంది తులసి ఒక్కసారిగా నిట్టూర్చి.

"అవునమ్మా ... జీవితమే ఒక కల" అంది తల్లి కళ్ళ నీళ్ళు తుడుచు కొంటూ—

ఇంక తను జీవిస్తుందని తన కేమీ నమ్మకం లేదు. కొద్ది గంటల్లోనే తన ఆయుష్పరిపూర్తి దగ్గరవుతుం దని తనకి తెలుసు. ఆ కొద్ది ఘడియల్లోనే తనకా ఉత్తరం చేరుతుందా? కళ్ళారా చూసి చదువుకొనే భాగ్యం తనకి లభిస్తుందా? ఏమో! ఎప్పటికో ... ? తను సజీవంగా ఉండగా తనకా ఉత్తరం రాదు కాబోలు! ఎందుకురాదూ? వస్తుంది. తప్పక వస్తుంది — తమ ఇద్దరికి ముహూర్తము నిశ్చయమై పోయినట్లే శుభలేఖ వస్తుంది—ఆ శుభముహూర్తాన్ని కాటుకకళ్ళతో ... కళ్యాణబొట్టుతో ... జల్తారు చీర కట్టుకొని మురసిపోతూ ఉంటే స్నేహితురాళ్ళందరూ చుట్టూమూగి తన్ని వేళాకోళంచేస్తూ ఉంటే సిగ్గుతో ముఖం దించుకొని చిలిపిగా వాళ్ళ కళ్ళలోకి చూస్తుంది.

అబ్బా! ఏంటీ ఆలోచనలు!!! చావు బ్రతుకుల మధ్య దూరం తగ్గిపోతూంటే ఏంటీ విపరీతాలోచనలు... తను కొద్ది ఘడియల్లోనే మరణిస్తుందని తనకి తెలుసు! కొద్ది క్షణాలు మాత్రం తనీ ప్రపంచంలో జీవిస్తుంది. ఇంక ఆ ఉత్తరం రాదు. ఉత్తరం కోసం ఎంతకాల మీ ప్రతీక్ష ...! ఇంక నా ప్రాణం నిరీక్షించలేదు—ఎప్పుడో నేను చచ్చిన తర్వాత...నా సమాధి మీదకు ఆ ఉత్తరం వస్తుంది...

గంట గంటకీ డాక్టర్లు వస్తున్నారు. మందులు పోస్తున్నారు. స్నేహితులు వస్తున్నారు. తులసిని చూస్తూ నిరుత్సాహంగా వెళుతున్నారు. అందరి ముఖాల్లోను విషాద

ముద్రతో ముద్రించబడి ఉన్నాయి. ఆ యింట్లోనుండి బయటకు వచ్చిన వారందరూ ఎందుకో పెదవి విరుచుకొనే బయటకు వస్తున్నారు. "మనోవ్యాధికి మందు లేదు" అంటున్నారు తల నెరసిన ముసలమ్మలు.

సాయంత్రం నాల్గుగంటల ప్రాంతంలో ఆ ఇంట్లో అందరూ గొల్లుమన్నారు — ఆత్రుతగా ఆ వీధిలో ఉన్నవాళ్ళందరూ ఆ యింట్లోకి పరుగెత్తుక వెళ్ళారు, శల్యమైన శరీరంలో, ఊగులాడుతున్న కొన ఊపిరి అనంతసృష్టిలో అంతర్థానమయింది. ఆమె ప్రాణాలు భౌతికశరీరాన్ని వీడి అమరసుఖాన్ని అనుభవించేందుకు ఏ అజ్ఞాతలోకానికో అదృశ్యమైపోయాయి,

నాల్గున్నర ఐంది—

ఆమె భౌతికకాయాన్ని శ్మశానానికి గొనిపోయేటందుకు ... వీధిలో అంత్యక్రియలు జరుగుతున్నాయి. ఆమెని ఎత్తిపట్టుకొని స్మశానానికి గొనిపోయే సమయంలో పోస్టుమేన్ పున్నయ్య శరవేగంలో సైకిలు త్రొక్కుకుంటూ ఆ వీధిలోకి వస్తున్నాడు. ఆ విషాదదృశ్యాన్ని చూసి, ఆ అభాగ్యుడు నిశ్చేష్టుడై నిర్జీవమైన చూపులతో నిలుచుండిపోయాడు. ఆమెకు వచ్చిన కవరు చేతుల్లోకి తీసుకొని దాని మీద రెండు వేడి కన్నీళ్ళు విడిచాడు. బహుశా ఆమె ఆత్మశాంతికోసం కాబోలు! జాలిగా ఆ ఉత్తరాన్ని ఆమె తండ్రి చేతుల్లో పెట్టబోయాడు.

" ఎందుకు వున్నయ్యా ఉత్తరం ? నా చిట్టితల్లి వెళ్ళిపోయింది." ఉత్తరం అందుకుంటూ బావురుమన్నారు. ఆ ఉత్తరంవైపు చూశారు.

ఆ నీలి కవరు చూస్తుంటె అతనికళ్ళు అశ్రువులతో నిండిపోయాయి. ఆ ఉత్తరాన్ని విప్పి చూడలేదు. ఇంకెందుకూ ? తన చిట్టితల్లి వెళ్ళిపోయింది.

తన చిట్టితల్లి ఆ ఉత్తరంకోసం చాలా కాలం ఎదురు చూసింది. ఇప్పుడు తనచేతిలో ఉన్న యీ ఉత్తరంకోసమే నిరాశతో మనోవ్యాధి పెట్టుకొని మంచమెక్కింది. చివరకు యీ ఉత్తరం కోసమే ఎదురుచూసి చూసి మరణించింది. మరణించినా యింకా ఆ కళ్ళు తెరచుకొని యీ ఉత్తరం కోసమే ఎదురు చూస్తోంది.

" అయ్యో ... తల్లీ ... ఎంతపని చేశావమ్మా " అంటూ ఆ నీలికవరు చేత్తో పట్టుకొని గోడు గోడున దుఃఖించారు.

చీకటి పడింది—

ఆమెను చితి కెక్కించారు...

ఇందులో ఏముందీ... ???

ఎవరు రాశారూ... ???

ఏమని రాశారూ... ???

ఇప్పి చూశారు — అందులో పసుపు పూసిన ప్రింటెడ్ పెళ్ళిపిలు పొక టుంది. అంతే—

"ఆ దౌర్భాగ్యుడు ఎంతపని చేశాడూ ? పెళ్ళిచేసు కుంటానని అన్నవాడు యిప్పుడు ఎవరినో పిల్లని పెళ్ళి చేసు కుంటూ, పెళ్ళికి రమ్మనమని తన కుమార్తెకు శుభలేఖ పంపించాడు.

ఆ ఉత్తరాన్ని నేలకి కసితీరా విసరికొట్టారు. "అయ్యో తల్లీ ... ఈ పాపిష్టి ఉత్తరం కోసమేనా యింత కాలం ఎదురుచూశావ్ !" అంటూ గుండె పగిలేటట్టు ఏడుస్తూ చితిమీద పడ్డారు.

జీవితాశ వదలుకొని చితిమీద పండుకొన్నా యింకా ఆమెకళ్ళు ఆ నీలికవరుకోసమే ఎదురు చూస్తున్నాయి. ఆయన్ని పక్కకు తీసేశారు...

క్రిందను పడిఉన్న ఆ కాగితంతోనే చితికి నిప్పంటిం చారు ఒకరు—

చితి బ్రహ్మాండంగా ముట్టుకొని చిటపటమంటూ పేల్తూ కాలుతోంది.

అగ్నిహోత్రం మధ్య ఆహుతి ఐ పోతున్నా ఇంకా తన చిట్టితల్లికళ్ళు ఆ ఉత్తరంకోసం ఎదురు చూస్తూనే ఉన్నాయ్—

(బహుమతి పొందిన కథానిక)

# కథాంజలి

## (తుషార్ కథల సంపుటి)

## రచయిత : తుషార్

—: అభిప్రాయాలు :—

శ్రీయుతులు మెట్ట సూర్యనారాయణమూర్తిగారి కథలు "తుషార్" "ఏకాక్షి" మొదలగు మారుపేర్లతో ఆంధ్ర పాఠకలోకానికి సుపరిచితం. ఈయన రాసిన "జీర్ణసౌధం" అనే కథానిక మరపురానిది. "కర్మవైరుధ్యం" నిజంగా కర్మవైరుధ్యమే! కరణంగారి పాత్ర చాల వాస్తవికంగా చిత్రించారు. కథ విషాదఛాయల్లో హృదయవిదారకమైన దృశ్యాలమధ్య సమాప్తమైంది. శ్యామలా, సూర్యం, శారదా బాధాహృదయాల్ని చాలా అద్భుతంగా సృష్టించారు.

'శిల్పసుందరి' కథానికలో శిల్పం—కథానికలన్నిటికీ మణిమకుటం. ఈ కథానిక చక్కని భావాలతో అత్యుత్తమ పంథాలో నడిచింది.

మిగతా కథలు గూడా ఎంతో బాగున్నాయి.

ఇటువంటి భావనాశక్తి గల యువరచయితల్ని ప్రోత్సహిస్తే ఇంకా కథానికా సాహిత్యం ఎంతైనా అలరారుతుంది.

పార్వతీపురం — శ్రీ తాళ్ళపూడి వెంకటరమణ.
తే 17-3-59.

---

'కథా' రచనలో తుషార్ అందెవేసిన చెయ్యి!! తుషార్ రాసిన ప్రతికథా...సృష్టించిన ప్రతి పాత్రా, పాఠకుల సానుభూతిని పొందుతా'య్...

భిలాయ్ — బి. వి. నరసింహం, ఎం. ఏ.,
తే. 4-2-59. — ఎడిటర్, — "తెనుగువాణి".

'నిగూఢరహస్యం' రచనా, శిల్పం...అద్భుతమైన శైలిలో నూతన పంథాలో నడిచింది. 'అశ్రుతర్పణం'...కథానికలోని జానకి పాత్ర చాలా అమోఘంగా సృష్టించారు. మిగతా కథలన్నీ చాలా అద్భుతంగా ఉన్నాయి.

శ్రీమతి పమిడిముక్కల అన్నపూర్ణాదేవి,
జబల్‌పూర్.

---

'కథాంజలి' అత్యుత్తమమైన కథలతో నిండి ఉంది. రచనలు చాలా హృద్యంగానూ, సరళంగానూ, శ్రోతలకు వినసొంపుగానూ ఉన్నాయి. ముఖ్యంగా తుషార్ ట్రేజడీస్ రాయటంలో అందెవేసినచేయి. ఇతని ప్రతి రచనా తరచి తరచి చూస్తే, రచనలోని విశిష్టత, పటిష్టం స్ఫురించక పోదు.

'నిరీక్షణ' 'ప్రసిద్ధ రచయిత మరణించాడు!!!' చాలా బాగున్నాయి. 'నిగూఢరహస్యం' స్వతంత్ర భావాలతో మంచి సస్పెన్సులో నడచింది.

కథానికల తీరుతెన్నులు తెలుసుకోవలసిన ప్రతి రచయితా చదవ దగ్గ పుస్తకం.

"స్వాతి" — భిలాస్‌పూర్.

---

'నారాణీ' బ్రహ్మాండమైన సస్పెన్సు...కథ చదివిన ప్రతి పాఠ కుని హృదయం తప్పక జలదరిస్తుంది. జీర్ణసౌధం కూడా అదే తీరుతెన్ను లలో నడచింది. ప్రతి పాఠకుడు "కథాంజలి" చదివి హర్షించి, ఆనందించ దగ్గ పుస్తకరాజం!

పార్వతీపురం, శ్రీ యనమండ్ర రామమూర్తి.
తే. 12-3-59.

---

కార్మికుడు, కూలినఇల్లూ నన్ను చకితుణ్ణిచేసి పారేసాయ్. మిగిలిన కథలన్నీ చాల అమోఘంగా ఉన్నాయి. తుషార్ ఎక్కువగా ట్రేజడీస్ రాస్తారు. అవి చదువుతూంటే "శరత్" మన స్మృతిపథంలో మెదల్తూ ఉంటాడు. అక్షర ఒరవడి, పాత్ర పోషణా ఇతని రచనలో ప్రతిబింబిస్తాయ్.

వడలి పాపారావు,
విజయనగరం,

# ప్రవాసాంధ్ర ప్రచురణల ఉత్తమ కథానికల పోటీ!!!—1

* 1. ఉదాత్తరచనా శిల్పంగల ప్రతి రచనకూ రూ॥ 10/- బహుమానం.
  2. వ్రాత ప్రతి పది పేజీలకు మించి ఉండకూడదు.
* 3. రచనలు 1-12-59 వ తేదీ లోపుగా పంపాలి.
  4. బహుమతి పొందిన కథానికలు వరుసగా మా ప్రత్యేక ఆకర్షణలలో ప్రచురింప బడతాయ్.
  5. అనర్హమైన రచనలు తిప్పి పంపివేసే నిమిత్తం అవసరమైన స్టాంపులు పెట్టి పంపాలి.
* 6. తుది నిర్ణయం సంపాదకులది.

చిరునామా:

To
The Honorary Editors,
PRAVASANDHRA PUBLICATIONS,
BHILAI—3.
(M. P.)

---

## ప్రవాసాంధ్ర ప్రచురణలకు

1. ప్రవాసి బుక్ డిపో — భిలాయ్-3.
2. శోభా ప్రచురణలు — విజయనగరం సిటీ.
3. లక్ష్మీస్టోర్స్ సెక్టర్ 2 & 4 — భిలాయ్.

మరియు అన్ని బుక్‌స్టాల్స్‌లోనూ, తదితర పెద్ద పుస్తకాల షాపులలోనూ, దొరుకుతాయి.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్:

ప్రవాసి బుక్ డిపో,
భిలాయ్—3. (మధ్యప్రదేశ్)

**KATHANJALI — By 'TUSHAR' — Rs. 1-50 Np.**

(AN ANTHOLOGY OF SHORT STORIES IN TELUGU)



తుషార్ పూర్తిపేరు మెట్ట సూర్యనారాయణమూర్తి.

జననం: 6–8–1935 అనకాపల్లి, విశాఖజిల్లా.

విద్యాభ్యాసం: మెట్రిక్యులేషన్.

ప్రచురింపబడిన కథానికలు: నారాణీ, శిల్పసుందరి, జీర్ణసౌధం, కార్మికుడు, ఆహుతి, స్వార్థం, తెగిన తీగ: చెడిన స్నేహం, అభాగ్యుడు మొ॥ కథానికలు. వీరి రచనలు త్వరలో కన్నడ, మళయాళ భాషల్లో అనువదించబడుతున్నాయి. తుషార్ రచనలో శిల్పం కథావస్తువుకన్న ఎక్కువగా ఉట్టిపడుతుంది.

ట్రాజడీస్ రాయటంలో అందివేసిన చెయ్యి.................
ఆంధ్రపాఠకుల్లో ఆదరాభిమానాన్ని చూరగొన్న యువక రచయిత తుషార్

**Pravasandhra Publications, BHILAI; (M. P.**